శ్రీ రామాయనమః

# టెంకాయచిప్ప శతకము

విరచితము

శ్రీ ఆంధ్ర వాల్మీకి

## వాసుదాస స్వామి



శ్రీరామాయనమః

# టెంకాయచిప్ప శతకము

(6-4-1925 నందు నొంటిమిట్టలో శ్రీకోదండరామస్వాముల యెదుట సభలోఁ జదువఁబడి యిది యీయన కర్పింపఁబడెయె.)



వావిలికొలను సుబ్బారాయ
విరచితము



శ్రీశ్రీశ్రీ "ఆంధ్రవాల్మీకి"
శ్రీ వావిలికొలను సుబ్బరావు (వాసుదాస స్వామి)
శ్రీ రామసేవా కుటీరము, వాల్మీకి ఆశ్రమము (శృంగిశైలము),
ఒంటిమిట్ట, కడప జిల్లా.

శ్రీరామాయనమః

# టెంకాయచిప్ప శతకము

## పీఠిక

**లక్ష్మీదేవి :-** అప్పా ! నీవు మీరుక్మిణమ్మకు అమ్మణ్ణికి నన్ని కథలు చెప్పితివే నా కేదైనఁ జెప్పరాదా? వారు నీ కెక్కు వేమి? నేను దక్కు వేమి? నన్ను నీపుత్రికగనే యనుకో అప్పా యనుట తప్పా?

**తండ్రి :-** ఓసి పిచ్చిదానా ! మూడుమాటలలో ముప్పది నిష్ఠురములా? మారుక్మిణమ్మ మాయమ్మణ్ణి గనుకఁ జెప్పిన వాఁడనుగాను. లోకస్థితిగతులఁబట్టి కొన్ని విషయములు చెప్పుట బాగని భగవత్ప్రేరణముచేఁ దోఁచినది. వారప్పుడు నా యొద్ద నుండుటచే వారి నుద్దేశించి చెప్పితిని. వారు బాగుపడనీ పడకపోనీ లోకమునవారైనను గొందఱైన బాగుపడుదురు గాక యని నా యభిప్రాయము. నీకు మాత్రము చెప్పనని యంటినా? ఎవరు పుత్రికలు? ఇంటఁ బుట్టినంతమాత్రమునఁ బుత్రికలు నింటఁ బుట్టకుండినఁ బుత్రికలు గారు? పూర్వజన్మ ఋణానుబంధముకొలఁది యప్పురాఁబట్టుకొని పోవువారందఱు బిడ్డలు చుట్టాలు తక్కి నవారుగారా? ప్రీతిభ క్తివిశ్వాసములు గలవా రెవ్వరో వారు నిజముగ బిడ్డలు వారు చుట్టములు కాని తక్కి నవారు గారు. భగవత్సేవ భాగవతసేవ నిజమైనప్రీతి భక్తి విశ్వాసములతో నెవరు మఱువేలుగోరిక చేయుదురో వారు నాకు బిడ్డలు, అక్క లు, చెల్లెండ్రు, తల్లులు, నీమగఁడు స్వామికార్యము నందు నిజమైన భక్తి విశ్వాస ములతోఁ దోడుపడిన కారణము చేతను, నన్నుఁ జూడ నప్పటినుండి నాయందుఁ బ్రీతివిశ్వాసములు నీవు కలదాన వగుటను నీవు నాకుఁ బుత్రికవే అట్టి గురుబుద్ధి నీకు లేదేని నీ వెట్లు నన్నప్పాయని పిలిచితివి? అప్పాయనుట తప్పనితోఁచిన నమ్మా యనుము నాబిడ్డలు నన్నమ్మగా నెంచుటె నాకు శ్రేయస్క రము అట్టి వారికే మనస్సువిచ్చి యేదైనఁ జెప్పుదును.

**లక్ష్మీదేవి :-** నేను మాధ్వస్త్రీని నీవు ...........

**తండ్రి :-** చాలుఁజాలు నిలువు నీవు మాధ్వస్త్రీవైనను, మఱియే స్త్రీవైనను నాకొక్క టే నీవు నిలువుబొట్టు పెట్టితివా, అడ్డబొట్టు పెట్టితివా, క్రిందిబొట్టు పెట్టితివా, కుడిపైఁట వేసితివా, ఎడమపైఁట వేసితివా, పైఁటయే లేకయున్నావా, లోగోఁచి పెట్టితివా, వెలిగోఁచి పెట్టితివా, గోఁచియే పెట్టవా యనునవి నాకు విచారణీయము లు కావు. నిజమైన భక్తివిశ్వాసములు నీయందుఁ గలవా లేవా యనియే నేను జూతును. ఇవి గలవా రేజాతి వారైనను, నేమతమువారైనను నాకు బంధువులే. అవి లేనివారు రక్తబంధువులైనను గడవారే ఇది భక్తిశాస్త్ర జ్ఞులు యధ్యవసాయము. ఇది నా భావనాప్రకారము. దీనిని సాధింప శమించుచున్నాను. పొందఁదగినవాఁడు భగవంతుఁడు వాసుదేవుఁడు నారాయణుఁడు. ఉపాయము భక్తిగాని, ప్రపత్తిగాని కాన వచ్చునట్టిది కాన రానట్టిది సర్వము ప్రతిపదార్థము ప్రణవ స్వరూపము, సీతారామలక్ష్మణ స్వరూపము. ఇది నా దృష్టిపథము.

**లక్ష్మీదేవి :-** ప్రణవస్వరూపము సీతారామలక్ష్మణస్వరూప మనిన నాకు బోధపడలేదు.

**తండ్రి :-** ప్రతి రూపమునందు వాస్తవ పదార్థములు మూఁడు గలవు. కానవచ్చు దేహము ప్రకృతి పరిణామము. అది సీత అది ప్రణవమందలి ఉకారము. దేహమం దుండువాఁడు జీవుఁడు మకారవాచ్యుఁడు దాసుఁడు లక్ష్మణుఁడు. ఈరెంటికి నాధారభూతుఁడు అకారవాచ్యుఁడు – ఈశ్వరుఁడు – విష్ణువు. ఈమూఁడు లేని పరమాణువు లేదు. ఇది తప్పఁ దెలిసికొనదగిన దేదియు రహస్యము లేదు. జీవుఁడు తాను దరించునుపాయ ము మాత్రము దెలిసికొనవలయును.

**లక్ష్మీదేవి :-** కాఁబట్టియే కదా నీవు జాతి పిన్న పెద్ద కులము గోత్రము విచారింపక యన్నిటికి నందఱకు నమస్క రించుట?

**తండ్రి :-** సత్యము.

**లక్ష్మీదేవి :-** ఆకారణముచేతనా నీవు టెంకాయచిప్పను " కలదె నీకంటె గొప్ప టెంకాయచిప్ప " యని పొగడితివి?

**తండ్రి :-** కేవల మాకారణముచేతనే కాదు. ఆకారణమేయైన పక్షయం దన్నిటితో నదియు సమానమే. అది చేసిన భగవద్భావతసేవ దొడ్డది.

**లక్ష్మీదేవి :-** ఓయి పిచ్చప్ప ! దేనికి బనికిమాలిన టెంకాయచిప్ప యేమి? భగవత్సేవ దానిలో దొడ్డసేవ చేయుట యేమి? దానికేమి ప్రాణమా? జ్ఞానమా? తెలివితేటలా? అది పుణ్య పాపము లెఱుఁగునా?

**తండ్రి :–** నేను పిచ్చప్పనో – నీవు పిచ్చిపిట్టవో దేవుఁ డెఱుఁగును. లోకమునఁ బ్రకృతి – జీవుఁడు – ఈశ్వరుఁడు లేని పరమాణువే లేదు. ఒకఁడు చచ్చినాఁ డనఁగానే వానియందు జీవాత్మలు లేవని యర్థమా ! ప్రతిపరమాణువునందు జీవుఁడు కలఁడు. కావున శవరూపముగ నుండు పరమాణువుల సమూహమంద న్నిట నొక్కొ క్క జీవుఁడు కలఁడు. ఇన్నిటికి మనస్సు చైతన్యము కలవు. దేశమునకంతయుఁ బ్రభువైన రాజువలె మనుష్యుఁడు జీవించి యున్నాఁ డను దశలో దేహమున కంతయుఁ బ్రభువైన జీవుఁడొకఁ డుండును.

ఒక పెద్ద ప్రభువునకు లోపడిన చిన్నప్రభువుల యధీనమందుండు గ్రామములవలెఁ బెద్దజీవునకు లోపడి కొన్ని చిన్నజీవులు దేహమునఁ గొన్ని కొన్ని భాగములకుఁ బ్రభువులై యుందురు. యకృత్తు – ప్లీహము – హృదయము – శిరస్సు లోనైనవి చిన్న గ్రామములవంటివి. వీనికిఁ బ్రభువులుగా నుండు జీవులు దేహమునకంతయుఁ బ్రభువుగా నుండు జీవుని యాజ్ఞకు లోపడి వర్తించుచుందురు. ఆ యాభాగము లలో నుండు పరమాణువులలోని జీవాత్మ లా యాభాగముల కధికారులైన జీవాత్మలకు లోపడి యవి చెప్పి నట్లు వర్తించును. వీని కన్నిటికి మనస్సు తెలివి గలవు. పెద్ద మనస్సు చెప్పినది గ్రహించు శక్తి జ్ఞానము వానికఁ గలవు. పెద్దరాజు చావఁగానే సామంతరాజు లందఱుఁ జత్తురా? గ్రామాధికారు లందఱుఁ జత్తురా? అట్టులే దేహమునందలి మహాత్మ దేహమును విడిచి పోయినను దక్కి నవి పోవు. అయినను నాజ్ఞపాలించు ప్రభువు లేకుండిన దేశ మరాజకమై ప్రజ లెవరియంతతట వారు స్వతంత్రులై యొకనిమాట వేఱొకడు వినక చరింతురో యట్లే మహాత్మ యధికారము లేక పోఁగానే యాయాభాగముల జీవులు స్వతంత్రులై యొకరితో నొకరు గలసి మెలసి వర్తింపక స్వేచ్ఛగా వర్తింతురు. ఎవరి త్రోవనవారు పోవఁజొత్తురు. అప్పుడు దేహమును గాల్చినను బూడ్చినను బరమాణువు లన్నియు విచ్చలవిడి పోయి మరల నెందేని కర్మముకొలఁది గుమిగూడు ను. ఇట్లు మహారాజు దేహమున నుండిన పరమాణువులు వానివాని పుణ్య పాప బంధములకొలఁది మరల మఱియొక మహారాజు దేహమునందో, సామాన్య మనుష్యదేహములందో, చెట్లయందో, మృగములందో, పక్షులందో, ఱాలయందో చేరును. మరల నన్నియు నొక్క చోటనే చేరవు. ఒక్కొ క్క టి యొక్కొ క్క చోటఁ జేరినను జేరవచ్చును. అట్లు చేరుట దైవాధీనము. ఇట్టులే ప్రతిదేహికి మృగమునకు, మనుష్యునకుఁ, జెట్టునకు నన్నిటికి నని యెఱుఁగుము. కావున నీ టెంకాయచిప్పయందు జీవుఁడు లేఁడని తలంపకుము. టెంకాయచిప్పయందుఁ బ్రతి పరమాణువునందు జీవుఁడు – ఈశ్వరుఁడు – ప్రకృతి సీతారామలక్ష్మణులు ముప్పురుగల రని తలంపుము.

**లక్ష్మీదేవి :–** అట్టైన నీ చిప్పకు ముక్తి గలుగు నందువా.

**తండ్రి :–** కలుగునో కలుగదో యది భగవత్కృప. నేనుఁ జెప్పజాలను. అది చేసిన కార్యముఁబట్టి కలుగ వచ్చు నని చెప్పెదను.

**లక్ష్మీదేవి :–** మనుష్యులలో నధమాధదములుగాఁబుట్టి యావల నధమ శూద్రులై యావల శూద్రులై యావల సచ్ఛూద్రులై యావల నుత్తమ వైశ్యులై యావల నట్లే క్షత్రియులు నావలనట్లే బ్రాహ్మణులు నై స్త్రీ లై పురుషులై కర్మజ్ఞానభ క్తివైరాగ్యముల సాధించినవారికిఁ గదా ముక్తి. ఱాలకు అప్పలకు జెట్టకుఁ జేమలకుఁ బశుపక్ష్యాదులకు మోక్షము గలదా?

**తండ్రి :–** ఎట్టిజీవికిని నేనాఁటికో యొకనాఁటికి మోక్షముగలదు గాని లేకుండఁబోదు. నీవు చెప్పినక్రమమార్గ మును వివరించి చెప్పెదను. ఒకజీవి కడఁదేఱు టెప్పుడో చెప్పుము. భగవంతుఁ డనేకకోటిబ్రహ్మాండనాయకుఁ డని వామనచరిత్రయందుఁ జెప్పితినిగదా. దానియందుఁ జెప్పిన ప్రకారము చూచిన నెన్నిబ్రహ్మాండములు గలవో నీవూహింపనైనఁ గలవా! ఈ బ్రహ్మాండము లన్నియు సమానదశయందుండునవి కావు. నేలనుండి పై మేడవఱకు వంకరవంకరగాఁ బాముచుట్టలవలె నందుసోపానములవలె నివియొక దానిపై నొకటి తరతమభేదములు గలవై యుండును. మొదటితరగతి దాఁటి రెండవతరగతి దాఁటి మూఁడవతరగతి నదిదాఁటి నాలుగవతరగతిఁ బోవునట్లు యొకమెట్టెక్కి మఱియొక పై మెట్టునకుఁ బోవునట్లే యొక బ్రహ్మాం డములోని యాత్ర యంతయుఁ జలిపి యందు నేర్చుకొనవలసిన దంతయు నేర్చుకొని యావల దానిపై బ్రహ్మాండమున నధమాధమదశయందుఁ బుట్టి క్రమముగ నుత్తమో త్తమదశకు వచ్చి తరువాత నా బ్రహ్మాం డమువిడిచి మరల నట్లే వేఱొక బ్రహ్మాండమున వర్తించి యిట్లు బ్రహ్మాండము లన్నియుఁ గోటానఁ గోట్లు దాఁటి తరువాతఁ బరమపదమున భగవత్సన్నిధి నిలుచును. మనబ్రహ్మాండమును గుఱించి చెప్పెదను. దానిని బట్టి తక్కి న బ్రహ్మాండము లన్ని దాఁటు టెప్పుడో చెప్పుము. రాత్రియం దొకసారి యాకాశ మెగఁజూ డుము.

వెలగచెట్టునందు వెలగకాయలవలె నాకాశమున నెన్నియో చుక్క లు గానవచ్చుచున్నవి గదా. ఇవి యెన్ని

యున్నవో నీవు లెక్కి ంపలేవుగదా. ఇవి యన్ని యేమిటివి? అన్నియు నన్నిగోళములు. అవి యన్నియు నొకదానిఁజుట్టి వేఱొకటి తిరుగునట్లే మనభూమియు నంతరాళమున సూర్యునిఁజుట్టి తిరుగుచుండును. ఇట్టి సూర్యు లెందఱున్నారో మనకుఁ దెలియదు.

ఇట్లు చూచిన నీ నక్షత్రమండల మెంతవఱకున్నదో దాని తరువాత నేమేమి యున్నవో యెవ్వఁ డెఱుఁగును? మన పురాణముల ప్రకార మీ నక్షత్రమండలమున కావల వాతాదిమండలములు గలవు. ఇవన్నియుఁ గలిసిన నొక బ్రహ్మాండమగును. ఒక బ్రహ్మ యధికారమునకు లోపడియుండునండ మొక బ్రహ్మాండము. బ్రహ్మాండ మంతయు నొకసారిగఁ జూచినఁ గోడిగ్రుడ్డువలె నుండును గనుక బ్రహ్మాండ మందురు.

ఈ బ్రహ్మాండములో నవ్యక్త చైతన్యములు కొన్ని వ్యక్తచైతన్యములు కొన్ని అవ్యక్తచైతన్యము లనఁగా గదులుట పెరుగుట లోనగు ప్రాణములుండు చిహ్నములు మనకుఁ గానరానివి ఱాలు మొదలైనవి. వ్యక్త చైతన్యములందుఁ గదులుట మొదలగు ప్రాణచిహ్నము లుండును. చెట్లు – పశువులు – పక్షులు – మనుష్యులు లోనైనవి. కుండలో నుంచిన దీపము వెలుతురు వెలుపలికి మనకుఁ గానరానట్టులు పాషాణాదుల చైతన్యము మనకుఁ గానరాదేగాని వానియందుఁ జైతన్యము లేకపోలేదు. వానికిని సుఖము దుఃఖము బాధ మూర్ఛ మృతివృద్ధిక్షయములు కలవు. ఈ యవ్యక్తచైతన్యములందు నధమాధమదశయం దుండునవి కలవు. ఉత్తమో త్తమదశయం దుండునవి కలవు. అధమాధమదశయం దుండునవి యేదో సుకృతవిశేషంబున నధమదశకు వచ్చి యట్లే క్రమక్రమముగ నుత్తమదశకు వచ్చి యావలనుత్తమోత్తమదశకు వచ్చును. చాఁప ఱాతికి – గుండ్రాతికి – రత్నములకు – లింగములకు – సాలగ్రామములకు నెంత తారతమ్యము గలదో యెఱుఁగవా. ఇనుమునకు బంగారునకు నెంతో భేదము గలదు గదా. ఇక్క డ మనకు స్థూలము లని తోఁచు పాషాణములు లోహములు మన బ్రహ్మాండమునకంటెఁ గ్రింది మెట్టున నుత్తమోత్తమ మగు నవ్యక్త చైతన్యములుగా నుండి వృద్ధిపొంది పైతరగతి కీ బ్రహ్మాండమునకుఁ బంపఁబడినవి. పాషాణములు లోహములు పైతరగతులకుఁ బంపఁబడిన వనఁగా నేమి యర్థము. వానియం దుండుజీవుఁడు మనయం దుండు జీవుఁడు సమానములే. అన్ని దీప స్తంభముల వెలుఁగుదీపములు సమానములే కదా. భేదించునవి పైశరీరములు మాత్రమే. మట్టికుండకు – గాజుకుప్పెకు నెంతభేదము లేదు? అట్టులే దేహములు స్థూలత మములు స్థూలతరములు స్థూలములు సూక్ష్మములు సూక్ష్మతరములు సూక్ష్మతమములుగా సంస్కా రము కొలఁదిఁబుణ్యాతిశయముకొలఁది మాఱుచుండును. ఒక్క బండ దేవాలయమునకు దేవునియఱుఁగున కుపయోగించిన మఱియొక్క టి మలవిసర్జనస్థానమున నుపయోగింపఁబడును. ఒక కుండ పెండ్లిండ్లకుఁ బోయిన వేఱొక్క టిమలమెత్త నుపయోగపడును. ఒక బండ మనుష్యులు హాయిగఁ బండుకొన నుపయోగిం చును. ఇట్లులవి యేదో యొకవిధముగ నితరజీవులు కుపకరించి యాపుణ్యవశమునఁ బైతరగతికిఁ బోవును. ఇట్లు చేయుటయందు వానికిఁ బ్రతిఫలాపేక్ష లేదు. ఇట్లు ప్రతిఫలాపేక్ష లేక స్వలాభాపేక్ష లేక చేయు నుప కారమునకే సేవ యని దాస్యమని పేరు.

ఇట్టవ్యక్తచైతన్యములం దుత్తమోత్తమదశ ప్రాపించినది. వ్యక్తచైతన్యమైపుట్టును. వ్యక్తచైతన్యములలో నధమాధమదశయం దుండునవి యుద్భిజ్జములు. అనఁగా విత్తనములఁ బగలఁ దీసికొని భూమిని భేదించు కొని వచ్చునవి. గడ్డిగాదము చెట్లు చేమలు మొదలైనవి – ఇవి యవ్యక్తచైతన్యమువలెనే స్థానము విడిచి ప్రాయికముగాఁ గదల లేవు కాని పెరుఁగుట కదలుట లోనగు ప్రాణచిహ్నములు కనఁబఱుచును. వీనియందు నిరువది లక్షల తెగలు కలవు. ఇవన్నియు సమానములు గావు. ఒకదానిని దాఁటి మఱియొక దానికిఁ గ్రమక్రమముగఁ బోవలయును గడ్డి – గడ్డలులోనైన విందుజేరినవే. క్రమము క్తిచెందు జీవుఁడిన్ని తెగలయందు జన్మింపవలయును. అంతియ కాదు ఒక్కొ క్క జాతియం దెన్నియో యవాంతరభేదములు కలవు. గడ్డియందు నరఁటులందు మామిడులందు నిది యది యననేల యన్నిటియందు నెన్నియో భేదములుగలవు గదా. ఇన్ని యవాంతరజాతులను జీవి దాఁటవలయును. ఇంతియ కాదు. ఒక్కొ క్క చెట్టునం దెన్నియో యాకులు పూలు కాయలు గలవు గదా. ఒక చెట్టునందే యొకయాకువలె మఱియొకయాకు, ఒక పూవువలె మఱియొక పూవు, ఒక కాయవలె మఱియొక కాయ గలదేమో పరీక్షించి చూడుము. ఏదైన నొకయత్యల్పభేదమైన నుండునుగాని లేకుండదు. ఇంతయేల? సృష్టియందుఁ గేవల సమానములుగ నుండునవి రెండు లేవని పూర్వులు చెప్పిన దెంతయు సత్యము. ఇవి యన్నియు నొకమెట్టు పై మఱియొక మెట్టువలె దొంతికుండల వలె నుండుననియే కావున వీనిపై నెక్క ఁబూనినచీమ క్రిందినుండి పైకుండకొనకుఁ బోవలయుననిన నిన్నిటిని నెట్లు ప్రాఁకవలయునో యట్లే జీవుఁ డిన్నిట జన్మింపవలయును.

ఇవి యిట్లు పై తరగతులకుఁ బోవుట కవిచేసిన యుపకారమే కారణము. కొన్ని యితరజీవుల కాహారమగును కొన్ని నీడ నిచ్చును. ఇట్టివే పరోపకారః పుణ్యాయ యన్నట్టు లవిపుణ్యము చేసి పై తరగతులకుఁ బోవును.

ఇట్లు ద్విజ్జములలో నుత్తమో త్తమదశ ప్రాప్తించిన తరువాత జీవి స్వేదజ జాతిలోఁ బుట్టును. స్వేదజ మనఁగాఁ జెమట యందుఁ బుట్టునవి. పేలు మొదలైనవి. ఇందును బదునొకండు లక్షల భేదములు గలవు ఇందు ననాంతరభేదము లెన్నియో కలవు. ఇన్నిటియందును జీవి పుట్టిపుట్టి చచ్చి చచ్చి యండజ జాతిలో జన్మించును. అండజ మనఁగా గ్రుడ్డునందుఁ బుట్టునవి. బల్లులు కోళ్లు మొదలైనవి. ఇందుఁ బది తొమ్మిది లక్షల భేదములు గలవు. వీనియందు ననాంతర భేదము లెన్నియో కలవు. పక్షులన్నియు నీ తెగలోఁ జేరినవే. చిలుకలు – కోళ్ళు వీనిలోనే యెన్నియో భేదములు కలవు కదా. ఇవన్నియు దాఁటిన జీవి జరాయుజ యోనియందు జన్మించును. యోని యనఁగా దల్లి కడుపులో జీవియుండు గర్భము. జరాయుజ మనఁగా మావునందుఁ బుట్టునది. వీనిలో 34 లక్షల భేదములుగలవు. ఇందును ననాంతర భేదములు గలవు. మనుష్యుఁడు జరాయుజములలోఁ జేరినవాఁడే. ఒక మనుష్యజాతియందె యెన్ని యవాంతర భేదములు గలవో చూడుము. ఇందఱు మనుష్యులలో నొకరివలె వేఱొక రున్నారేమో చూడు. మనుష్యునందే కుడిప్రక్క కు నెడమ ప్రక్క కుఁ గొంచెమైన భేదముండునుగదా. చతుష్ప్రాజ్జంతువు లన్ని నన్నిటిని దాఁటి నరునివంటి వాఁడై (వానరుఁడై నర ఇవవానరః) యావల నరుఁడై జన్మించును. ఎనుబదినాలుగు యోను లనులెక్క యిదియే. మనుష్యులయందు రెండు లక్షల భేదములు గలవు. అధమాధమ మనుష్యుఁడై శూద్రుఁడై వైశ్యుఁడై క్షత్రియుఁడై యధమ బ్రాహ్మణుఁడై క్రమముగ నుత్తమోత్తమ బ్రాహ్మణుఁడై భగవంతుఁడు తన కిచ్చిన జ్ఞానమును వ్యర్థముచేయక దుర్వినియోగ పఱుపక తత్ఫలముగ ముక్తిని సంపాదించును, ఆర్యకథానిధి 8వ భాగమున నజామిలో పాఖ్యానము చదువు. అంతకుఁ దక్కు వ రకమువాఁడు స్వలాభార్తియై దాన ధర్మములు పుణ్యకార్యములు చేసి యా పుణ్యఫలమువలన స్వర్గమునకుఁ బోయి పుణ్యఫల మనుభవించి మరల భూమిపై జన్మించు చుండును. అంతకు నధముఁడు పాప కార్యములుచేసి నరకముల పాలై మరల నధమ మనుష్యుఁడుగానో పశువుగానో పక్షిగానో జన్మించి యాకష్టములచేఁ దెలివి తెచ్చుకొన్నవాఁడై ధర్మములు చేసి స్వర్గాది సుఖము లనుభవించుచు వానిని రోసి తుదకు జ్ఞానిగనో భక్తుఁడగనో యై ముక్తి చెందును. ఇక్క డ ఋషిచర్యయం దుండు వారు మహర్షుల లోకమేగి మరల యిందురాక యక్క డనుండియే బ్రహ్మలోక మేగి బ్రహ్మయుండు నన్నాళ్లుండి బ్రహ్మతోడము క్తిచెందుదురు. బ్రహ్మయువు మన 895,622400000000 సంవత్సరములు. ఇన్ని సంవత్సరము లయినతర్వాత బ్రహ్మ యీ బ్రహ్మండమున ముక్తుఁడగును.

భగవత్సంకల్పముకొలఁది మరల జన్మమే లేకపోవచ్చును లేక యింతకంటె గొప్ప బ్రహ్మండ మండల ముననైన జనింపవచ్చును. రాఁబోవు బ్రహ్మ హనుమంతుడు. ఒక్క బ్రహ్మండమున నన్ని జన్మములయినచో ననేకకోటి బ్రహ్మండములదాఁట వలయుననిన నెన్ని జన్మములె త్తవలయునో యెంత కాలము పట్టునో నీవే యాలోచించి తెలిసికో. అది లెక్కి ంచు శక్తి నాకు లేదు. మీఁదఁజెప్పిన వరుస పై మెట్టునుండి క్రింది మెట్ల పై మరలఁబడక క్రమక్రమముగ దాఁటి పోవువారివిషయము. ఇప్పుడు మనలో బ్రాహ్మణులుగాఁ బుట్టినను దురాచారములచే దుశ్చేష్టలచేఁ బశువులుగనో పక్షులుగనో పుట్టఁగలవా రెందఱు లేరు అధమజాతుల యందుఁ బుట్టఁగలవా రెందఱు లేరు? మరల వీరు పైకి వచ్చు టెన్నఁడు?

ఇది దేహి యాత్రావిధానము. అమ్మా ! ఎవ్వరు లేని చోట సద్దు చప్పుడులేనిచోఁ గూర్చుండి యిట్టు లాలోచింపుము. ఆహా ! మన మెన్ని జన్మము లెత్తి యీమనుష్యజన్మమునకు వచ్చితిమి. ఇంకను స్త్రీగనేకదా యున్నదానను. పురుషుఁడుగ నగు టెప్పుడు? పురుషుఁడనై నను గర్మాను భవాంతమునఁగదా ముక్తి. కర్మానుభవ మెప్పుడుముగియును? ఒక చింత గింజ భూమిలో నాటిన నదిచెట్టై యెన్ని గింజలఁ గలిగించును. ఆ గింజలన్ని మరల నెన్నిగింజలకుఁ గారణముగును. అట్లే నేనొక జన్మమునఁ జేసినకర్మములే యెన్నియో జన్మములఁగలిగించును. ఆయొక్కొ క్క జన్మమునందుఁ జేసినవి మఱి యెన్నియో జన్మములకు హేతువు లగును. ఇట్టయినఁ గర్మానుభవమునకంత మెన్నఁడు? ఉత్తమోత్తమ బ్రాహ్మణుఁడై ముక్తి సాధించుటెన్నఁడు? ఇప్పటికి మనమెన్ని మెట్టు లెక్కి వచ్చితిమి? రాయి అప్ప గుట్ట చెట్టు కుక్క నక్క చీమ దోమ గొఱ్ఱె బఱ్ఱె పంది నంది గాడిద జింక కోఁతి యివన్నియు మనముండిన రూపములే కదా. ఇవన్నియు మన తోలుతటి వాసగృహములే కదా.

ఒక పెద్దనిచ్చెనపై నొక మెట్టుమీఁద మనముండినట్టు దలంచి యిట్టె లాలోచింపవలయును. ఇప్పుడు మన మీ మెట్టుమీఁదనున్నాము. ఎన్ని మెట్లెక్కి యీ మెట్టు మీఁదికి వచ్చితిమి? ఇఁకనెన్ని మెట్లెక్క వలయును? పదునాలుగు లోకములలో నేడవలోకమున మనమున్నాము. ఇఁక నేడులోకము లెక్కి పోవలయును. ఇటు

దిగువcజూచితిమా మన మీనిచ్చెన నెక్క నెప్పుడు ప్రారంభించితిమో తొలిమెట్టేదియో యదియుగానరాక యున్నది. ఇcక నెన్ని మెట్లెక్క వలయును? కడపటి మెట్టేది? అని యెగcజూచిన నదియుc గానరాకున్నది. ఈమెట్టునుండి కాలుజాతిక్రిందcబడకుండినc గదా పై మెట్టు మీcదికిc బోవుట. ఇప్పటి మనచర్యచూచిన మనము క్రిందికిcదొర్లమని యేమినమ్మకము? పై మెట్టునకుc బోcదగినకార్యముల నేనేమి చేసితిని? ఏమిచేయుచున్నదానను? ఇట్లయిన మన ప్రయాణమున కాది యెప్పుడు? అది యెప్పుడో. అంత్యమెప్పుడు? అదియేమో? తుదమొదలులేని ప్రయాణమెన్ని నాళ్లని చేయదును? కన్నులకుc గానరామి యటుండ మనస్సుచే నూహింపనైన సాధ్యపడకున్నదే. ఇన్ని మెట్లెక్కి వచ్చితిని. ఇcక నెన్నియో మెట్లెక్క వలయు ననెడి జ్ఞాన మింతకుc బూర్వము క్రింది మెట్లపై నున్నప్పుడు లేదాయెcగదా? ఇప్పుడు జ్ఞానము కలిగెనుబో. దీనినుండి తప్పించుకొను టెట్లు? సులభముగc బైమెట్టు కెగసిపోవునుపాయము లేదా? ఇన్ని మెట్లుదాcటి యీ మెట్టున కెట్లువచ్చితిని? స్వశక్తిచేతనా? ఎవరైన నీడిచి తెచ్చిరా? గోపురమెక్కె డు వానికి వలెc గ్రిందివైపు చూచినc గన్నులు తిరుగును. పై వై పెcజూచిన దిగులగును. ఏమిగతి యని బాగుపడు కాలము వచ్చినవానికి నిర్వేదము జనించును.

**చం.** **" పురుషభవంబు నొందుట యపూర్వ జన్మములందు, నందు**
**భూ సురకులమందుc బుట్టు టతిచోద్య "** మను పద్య మిప్పుడర్థమగను.

**సీ.** **కంటిరే మనవారు ఘనులు గృహస్థులై**
**విఫలులై గైకొన్న వెఱ్ఱితనము**
**భద్రార్థులై యుండి పాయరు సంసార**
**పద్ధతి నూరక పట్టుపడిరి**
**కలయోనులందెల్ల గర్భాద్యవస్థలc**
**బురుషుండు దేహియై పుట్టుచుండుc**
**దన్నెఱుంగcడు కర్మతంcతుcడై కడపట**
**ముట్టcడు భవశతములకు నైన**

**గీ.** **దీన శుభము లేదు దివ్యకీ ర్తియు లేదు**
**జగతిc బుట్టి పుట్టి చచ్చి చచ్చి**
**పొరల నేల మనకుc ? బుట్టని చావని**
**త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి.**

అనెడి దొడ్డబుద్ధి యిప్పుడు జనించును.

మనుష్యజన్మము వచ్చువఱకుc బ్రకృతిబద్ధుcడైన జీవుcడేటిలో బడినకట్టె ప్రవాహవేగంబున నీటి వెంటc బోయి నట్లు ప్రకృతి ననుసరించి వర్తించుచు నాcకలియైనc దినుచు, నిదుర వచ్చిన నిద్రించుచు, గొట్టులకు భయపడుచుc, గామమె త్తినc బెంటితో గలయుచుc కాలము గడపుటచేc బ్రకృతియే వీని నొక మెట్టు నుండి మఱియొక మెట్టునకు దాcటించుచుండును.

మనుష్యజన్మమునందు జ్ఞాన మంకురించును. ఆనందానుభవము తలచూపును నవ్వుట యానందా నుభవచిహ్నము. మనుష్యుcడుతప్ప వేఱొకజంతువు నవ్వదు. మనుష్యుcడుతప్ప వేఱొకజంతు విట్టు లాలో చింపదు. జీవుని జ్ఞానానందస్వరూప లక్షణ మిప్పుడే వెలికి గోచరింప నారంభించును. జ్ఞానమువలన స్వాతంత్ర్యము నానంద మనుభవింపవలయు నను కోరికయు జనించును. ఈ రెంటిని మనుష్యుcడు సరియైన మార్గమున నుపయోగించెనా బాగుపడును. దుర్వినియోగపఱిచెనా చెడును.

మనుష్యుc డెట్టు లీ రెంటిని దుర్వినియోగపఱుచు నందువా? చెప్పెద వినుము. ప్రతిదేహమునందుc బ్రకృతిసంబంధమైన దేహము, ఈశ్వరసంబంధమైన జీవుcడు నుండుట తెలియును గదా. మనుష్యదేహము వచ్చువఱకు నీ రెండు నుండుట తెలియదు. దేహమే తా ననుజ్ఞానము మాత్రమే యుండును. కావునc బ్రకృతివిధులకు లోపడియే వర్తించునుగాని దాని నతిక్రమించు యోజనయే కలుగదు. కావున దేహజన్య సంబంధమైన రోగాదిభయము లేదు.

ప్రకృతివిధు లేమనెదవా? ప్రకృతివిధులకు లోపడి వర్తించు వృక్షపశ్వాదులఁ జూడుము. ఆహార నిద్రా భయ మైథునములు ప్రకృతి ధర్మము లగుటచే మనుష్యులకుఁ బశువులకు నవి సమానములు. వీని యందు నిజస్వాతంత్ర్యము లేక కేవలప్రకృతికి వశపడి యది నడపించినట్లు నడచు పశ్వాదు లెట్లున్నవో స్వతంత్రజ్ఞానముగల మనుష్యు లెట్లున్నారో చూడుము.

పశుపక్షాదు లాఁకలియైననే యాహారము తినును గాని తక్కి నవేళలఁ దినవు. తినినను మితముగ దేహారోగ్యము చెడకుండునట్లు తినునేకాని యమితముగ నజీర్ణరోగ ముదయించునట్లు తినవు. పశుపక్ష్యా దులం దజీర్ణ వ్యాధిచే బాధపడునవి కలవా? అజీర్ణరోగము మనుష్యులందుమాత్రమే కలదు. ఆ యాహార మైనను స్వభావసిద్ధ మైనదానినే తినును గాని కృత్రిమాహారమైనను స్వభావసిద్ధ మైనదానినే తినును గాని కృత్రిమాహారములను నిజప్రకృతివిరుద్ధాహారములను దినవు. ఆకులలములు గడ్డిగాదములు దిను నావులు మేకలు లోనైనవి వానినే తినును గాని మాంసాహారమును గొనవు. మాంసము ప్రకృతి సిద్ధాహారముగాఁ గల పులులు సింహములు తోడేళ్లు లోనైనవి మాంసమునే తినును. ఇవన్నియు మంచిచల్లనినీటిదప్ప మఱి యొందు ద్రావవు. కావున వీనికి నాహారజన్యవ్యాధులు గలుగవు. ఇఁక మనుష్యులను నందు నాగరికులను జూడుము. స్నానపానములకు వేఁడినీరే కావలయును. ఆఁకలి లేకున్నను రెండు గంటల కొకసారి యే కసుమాలమో పొట్టకు వేయుచు నేయుండ వలయును. అదియు నగ్నిపక్వమై యుప్పు మిరపకాయ చింత పండు ఇంగువ లోనగువానితోఁ జేరియే యుండవలయును. దీనివలన శిశువు గర్భములలో నుండునది మొదలు రోగముతో నేడ్చుచునే యుండవలయును. భగవంతుఁడు వంటి చెట్టు చెట్టునందుఁ గొమ్మకొమ్మ యందు సిద్ధముగ నుంచినను వాని నెప్పుడో యొకప్పుడు తప్ప నరుఁడు గొననొల్లఁడు. అవి తినఁడని యూరకున్నాఁడా? ఎద్దులు మొదలైన జంతువులనే బాధపెట్టి తెలిసి కొంత తెలియకొంత యనేక జీవహింస గావించుచు నేల దున్ని పైర్లు పెట్టి పండించి యెంతో శ్రమపడి కొంపకుఁ దెచ్చుకొని వండి తినుచున్నాఁడు. ఎక్క డ దొరకిన యాకో కాయో పండో గడ్డయో యక్క డనే నోర వేసికొని హాయిగాఁ బోక యావంటకై యొకరి నుంచుకొనును. ఈవిధముగఁ గూడు సంపాదించుకొనుటకై యెంత క్లేశపడును ! ఇంతశ్రమము స్వభావముగ నెంచుకొనును గాలి తానై తెచ్చిపెట్టుకొన్న తద్దినముగా నెంచలేఁడు. 'ఈ జేనెడు పొట్టకై యెన్ని యసత్యములు ! ఎన్ని మోసములు !! ఎన్ని కష్టములు !!! ఎన్నికలహములు ! ఎన్ని హింసలు ! అహంకారమెంత ! మమకారమెంత ! అయ్యయ్యో యివియన్ని యాలోచించినఁదలతిరుగును. మనుష్యు డెంత నిర్భాగ్యపుజంతు వనిపించును. ఈవిధముగఁ బ్రత్యక్షముగనో పరోక్షముగనో యన్యజీవహింసచేఁ దనదేహమును గాపాడుకొనుచు నా పాపమున నానానరకయాతన లందుచుండును. తాను బూర్వజన్మమునఁ బులిగాను సింహము తోడేల మొదలైన ఘాతుకమృగములుగాను నుండిన వాసనాబలమున నా మృగముల వలెనే తానును జీవహింస గావించి యా మాంసమును దినుచు. ఈ ఘాతుకమృగత్వవాసన గలవారే మంసభోజులు. ఈ భోజన ముందువఱకు మనుష్యుఁడు మృగమనియు నింకను మనుష్యత్వమును బొంద లేదనియు నెంచుము. ఎవరి యందు సత్త్వగుణము ప్రకాశింప నారంభించునో వారు మాంసాహారముఁ గొనరు. తామసులయుఁ గొంతవఱకు రాజసులయు నాహారము మాంసము. ఈ రెండు గుణములను గలవారెన్ని పుణ్యంబులను జేసియు స్వర్గమును దాఁటిపోఁజాలరు అంతకుఁ బై లోకములకుఁ దీసికొని పోఁగలిగినది సత్త్వగుణమే. సాత్త్వికులు ప్రకృతిబంధము పృథివీతత్త్వము క్షీణించినఁగాని పైలోకములకుఁ బోలేరు. అట్టివారికి మాంసాహారము విరోధి. కావున దానిని మనస్సునందైనఁ దలఁపరు. మనుష్యులకు మీఁదఁ జెప్పినట్లు కృత్రిమాహారమునందు వలెనే కృత్రిమ పానమునందుఁ బ్రీతి, భగవంతుఁ డిచ్చినవి యారోగ్యకరములైనవి ధనవ్యయముతోఁ బనిలేనివి యైన మంచినీళ్ళుండఁగాఁ గాఫీయని సోడాయని కోకోయని సారాయమని రంగులురంగుల నీళ్ళనన్నిటిని నందు విషమిశ్రములను దబ్బిచ్చి కొని త్రాగెదరు. ఈ పెద్దమ్మలకు నీ పాడు కాఫీనీళ్ళు త్రాగుట గౌరవము. మంచి నీళ్ళు త్రాగిన న్యూనత. కొందఱు పూతనల వంటి యాఁడుపిశాచులు నోరెఱుఁగనిబిడ్డలు నోరను వీనిని బోయుదురు. ఈ విషయమున నింకను జెప్ప వలసియున్నదిగాని నీవే యాలోచింపుము. ముక్కు లోకిఁ బొగాకుపొడి గొంతులోకిఁ బొగాకుపొగ యేమిటికో యా వికారమృగములకే తెలియవలయును. ఇక రెండవది నిద్ర. మనుష్య పశువుతప్ప మఱి యేదిగాని చెట్టుగాని పక్షులుగాని పశువులుగాని సూర్యోదయసమయంబున నిద్రపోవునా? కాకులు కోళ్లు పక్షులు దూడలు ఆవులు లో నైనవన్ని యెప్పుడు నిద్రలేచును? కమలములు లోనైనవన్ని యెప్పుడు వికసించును? ఉదయమున 8 గంటలవఱకు నిద్రించువాఁడు మనుష్యుఁడు మాత్రమే. అందు రాజసుఁడు తామసుఁడు మాత్రమే. సాత్త్వికుఁడు బ్రాహ్మముహూర్తమందే నిదురలేచుచు. నిద్రయుఁ దమోగుణలక్షణము కావున సాత్త్వికుండు సాధ్యమైనంత క్రమక్రమముగ నిద్రను తగ్గించును.

**భయము :–** మనుష్యుఁడు మృగములచేతిలోఁ జిక్కి తప్పించుకొనవచ్చును గాని మనుష్యునిచేతిలోఁ జిక్కి తప్పించుకొన లేఁడు. కనుకనే మనుష్యుఁడు మనుష్యునిచేతిలోఁ జిక్క రాదని సామెత. మనుష్యుని విషము వంశమును దేశమును బాడుచేయును. మృగవిష మొక్క నిఁ జంపినఁ జంపును.

**మైథునము :–** నీ వాఁడు దానవు గావున నీతో నేనీ విషయము విశేషించి చెప్పుట నాకుఁ దగదు. అయినను బశువులు పక్షులు ఋతుసమయమందుమాత్రమే కలియును. మనుష్యులో......... నీకుఁ దెలయని దేమి యున్నది. ఇందును రాజసులు తామసులు పశువులకంటె నికృష్టముగ వర్తింతురు. విధిలేదు. నిషేధము లేదు. వేళ లేదు. ఋతువులేదు. కామముండనీ, లేకుండనీ, వేఁకటిగాని పిల్లతల్లిగానీ యిఁక నేనేమి చెప్పుదును స్వభావస్థితిలో రుచిలేదు. నిమిషము దురదకు 84 బంధములు కావలయునఁట. మనుష్యుఁ డిట్లు వికటవ ర్తనుఁ డగుటకుఁ గారణమేమి?

ఆనంద మిట్టిది యని తెలిసికొను తెలివి, దానిని సంపాదించుకొనుటకు జ్ఞానము నిచ్చి దీనితో మీరు శాశ్వతానందము సంపాదించుకొని సుఖపడుఁడని భగవంతుఁడు దానికిఁ గావలసిన సాధనములఁ గరణకళేబరము లీయఁగా మనుష్యులు శాశ్వత బ్రహ్మానందము మాఱు తుచ్ఛవిషయానందమునకు పశులై యిన్ని పోకలఁ బోవుచున్నారు.

ఇట్లు విషయానందానుభవమున శ్రమించి శ్రమించి కఠిన శిక్షలనుభవించి యెన్నియో వేలజన్మముల వెనుక శాశ్వత బ్రహ్మానందము సంపాదింప నరుఁడు యత్నించును. అప్పటికి వీఁడు నిజమైన మనుష్యుఁడు.

ప్రతిశరీర మందును బ్రకృతిసంబంధమైన దేహము, ఈశ్వరాంశమైనయాత్మ కలసియున్నవని రెండు ను విరుద్ధగుణములు కలవని, తాను దేహముగాదని యెంతవఱకు నెఱుఁగడో యంతవఱకు నొకఁడు రెండు కాళ్లపై నిట్టనిలువున నడుచు పశువేకాని మనుష్యుఁడు కాఁడని చెప్పితిని. అవి తెలిసినప్పుడే దేవుఁ డిచ్చిన జ్ఞానము సరియైన మార్గమున వర్తింప నారంభించినది యగును. ఇట్టిజ్ఞాన ముదయించినవాఁ డిట్టులాలోచించును.

భగవంతుఁడు మన కనుగ్రహించిన జ్ఞాన మను సాధనముచే నేనువేఱు దేహమువేఱు. దేహజడము. అది సంసార యాత్రచేయుటకై భగవంతుఁడు నా కిచ్చిన వాహనము. అది ప్రకృతిసంబంధము. కావునఁ బ్రకృతివిధుల ననుసరించియే దానిని మనము రక్షించిన నది మన కుపయోగ పడును. దేహిదేహ మనునవి యన్నిటి యందును గలవుగదా. ఇన్నిజన్మములు మాఱి యీజన్మమున కెట్లు వచ్చితిని? ఎవరు తెచ్చిరి. ప్రకృతి జడము కావున దాని కా శక్తిలేదు. ప్రకృతి యనెడు సంకెలచే బద్ధుఁడనై దేహమను చెఱసాలయందుఁ బరతంత్రుఁడనై పడియుండు నాకును నట్టి శక్తిలేదు. కావున నన్నీదశకు క్షేమముగాఁ దెచ్చినవాఁడుమూఁడవ వాఁడొకఁడుండవలయును. ఆయన నన్నొకనినిమాత్రమా యిట్లు తెచ్చెను? సమస్త భూతకోటిని వానివాని సుఖదుఃఖములు దశలు తెలిసి వేనివేని కేవేని యెప్పుడెప్పుడు చేసిన వానికి మేలో యవి యెఱిఁగికదా చేయుచున్నాఁడు. కావున నాయన సర్వజ్ఞుఁడు – సర్వశక్తుఁడు. సర్వవ్యాపి – కరుణామయుఁడు – వాత్స ల్యపూర్ణుఁడు – దీనానుకంపియై యుండవలయు ననుటనిస్సందేహము. మెట్లసంఖ్యచూచిన నెందో యాకా శమున నెవ్వరికిఁ గానరాక పరమపదమం దున్నాఁడని తోఁచునుగాని యిట్లు చూచిన సర్వవ్యాపియగుటచే మనయందు నున్నాఁడు. మనలోపల వెలుపలఁ గ్రింద మీఁద నన్నిప్రక్క ల సర్వకాల సర్వావస్థల నున్నాఁడు. ఇటుచూచిన సముద్రములోని చేయవలెఁగదా నేనాయనయం దున్నాను. ఆయనయందే నిలిచి యున్నాను. కూర్చుండియున్నాను. నిద్రించుచున్నాను. నడచుచున్నాను. తినుచున్నాను. త్రాగుచున్నాను. అన్ని కార్యము లాయనయందే చేయుచున్నాను. ఆయనలేని స్థలమే లేదాయెఁగా. ఇఁక నాయనను గాదని దేనినైన నెట్లు చేయుదును? ఇవన్నియు నేనై స్వతంత్రించి చేయుచున్నానా? ఉద్భిజ్జముగా నుండి స్వేదజ మగుటకు స్వేదజముగానుండి యండజమగుటకు, నండజముగానుండి జరాయుజ మగుటకు నేనేమి కృషి చేసితిని? తల్లులు గర్భములలో నన్ను రక్షించినవాఁ డెవ్వఁడు? నిద్రపోవునపుడు రక్షించువాఁ డెవఁడు? అప్పు డంతయు నింతకాలముగ రక్షించినవాఁడు నేఁడు తటాలున నన్నుఁ జేయివిడిచి పోవునా? ఆటల మరగి తన్ను పేక్షించిన శిశువును తల్లి విడనాడునా? ఒక మెట్టునుండి పై మెట్టునకు భగవంతుఁడు తెచ్చెఁగదా. అట్లుతెచ్చుట కేమికారణము? ఆయనకు నేనేమి మేలుచేసితిని? నిష్కా రణమేని యందఱ నేల సమానస్థితి యందుంచలేదు? తండ్రి బాలునిఁజూచి నాయనా! యా కల మిట్లు తెమ్మన నతఁ డట్టులే తప్పటడు లిడుచుఁ బడుచు లేచుచుఁ బోయి తెచ్చి తండ్రికిచ్చిన నాయన యెంతో సంతోషించియెత్తి ముద్దాడును. ఆకల మాయన తెచ్చుకోలేకయా యా బాలునికిఁ జెప్పుట? అట్టులే దేవుఁడు జీవినొక కార్యమందు నియ మించి యది చక్క ఁగఁ జేసిన సంతోషించి యంతకుఁ బైతరగతికిఁ బంపును. ఏ తరగతియం దెవరున్నారో యా తరగతి పాఠములు వారు చక్క నేర్చిరా

లేదా యనియే భగవంతుఁడు చూచి చక్క cగ నేర్చినc బైకిc బంపుచుండును. కావున మనచేతc గార్యములు చేయించువాఁడు సంతోషించువాఁడు ఫలము నిచ్చువాఁడు భగవంతుఁడే. కలము తెచ్చిన బాలుఁడు నాకుc కాలణాయిచ్చిన దెచ్చెద ననెనా? అట్లనినc దండ్రి సంతోషిం చునా? కావున వాత్సల్యపూర్ణుఁడైన భగవంతుఁడే జనకుc డనియు నాయన యందుc బ్రీతి విశ్వాసము లుంచి యాయన చెప్పిన కార్యములు పిత్రాజ్ఞ కావునc గర్తవ్యములని చేయుచు దేహాత్మాభిమానము అహంక ర్తృత్వాభిమానము స్వాతంత్ర్యాభిమానము వదలి పుత్రునివలె దాసునివలె వర్తించును నాయన మార్గమందుండితి మేని భగవంతుఁడు సర్వజ్ఞుఁడు మన కేది క్షేమమో దానిని గావించును. ఇంతకు మించి మనవలన నాయన యే ఫలము గోరcడు.

ఆయన మార్గమందు వర్తించుట యన నేమి? ఇన్ని జీవకోట్ల నుద్ధరించుటకుcగా సర్వకాల సర్వావస్థల నెంతో హెచ్చరికతో భగవంతుఁడు వర్తించుచున్నాఁడుకదా? ఏమి ఫలము స్వలాభము కోరి యట్లు చేయుచు న్నాఁడు? కేవల దయచేతనే? అట్టులే మనమును స్వరక్షాభరము – తత్ఫలము – సర్వ మాయనయందే వైచి యాత్మార్థ మేదియుc జేయక యదృచ్ఛాలాభసంతుష్టి గలిగి సర్వము భగవన్మయము కావున భగవత్సే వాబుద్ధితో లోకసేవ చేయవలయును. లేదా యట్టి శక్తి గలదేని భగవత్సేవయే చేయవలయును. తరించుట కితరులు చెప్పు మార్గములు సాపాయములు క్లేశయు క్తములు – అనిశ్చిత ఫలములు.

ఇది నిరపాయము – నిశ్చిత ఫలము. ఆ స్తంబ బ్రహ్మపర్యంరోత్తరాభివృద్ధికి మోక్షమున కిదియె మార్గము. శిలలు శయ్యానన రూపంబు లోకుల కుపకరించియే యుద్భిజ్జములగుచున్నవి. అని పత్ర – ఫల – కుసుమ చ్ఛాయా ప్రదానరూపముగ నితరజీవులకు సేవచేసియే స్వేదజము లగుచున్నవి. అవి యితర జీవుల కుపకరించియే యండజము లగుచున్నవి. అవి యితర జీవసేవచేతనే జరాయుజము లగుచున్నవి. అందును నన్యజీవిసేవ చేతనే మనుష్యత్వము పొందుచున్నవి. అందు నన్యసేవచే స్త్రీత్వ పురుషత్వ శూద్రత్వ వైశ్యత్వ క్షత్రియత్వ బ్రాహ్మణత్వమును బొంది యందు త్తమదశc బ్రాపించి తరించుచున్నవి. ఈ దశాక్రమము భక్తిచే భగవత్సేవ భాగవతసేవ చేయక సమాన ప్రపత్తిచే నితరుల కుపకరించువారి కగును. భగవత్సేవ భాగవతసేవ చేయువారికిc గ్రమమార్గము లేదు. వానివాని శ్రద్ధ యార్తికొలఁది యా జన్మమందే మోక్షము లభించును. ఇది సద్యోముక్తి. ఈ సేవను గుఱించి సీతాదేవి చరిత్రయందుc జెప్పితిని గదా. ఈ టెంకాయచిప్పయు నిట్లు భగవత్సేవ చేసి దాని జన్మము సార్థకపఱిచికొనెను. ఎన్నియో కోట్లకొలc దులు టెంకాయ లుండ నీ టెంకాయకు మాత్ర మీకైంకర్య ప్రాప్తి కలుగుటకు విశేషకారణ మేదేని లేకుండునా? ఒక వంశమున మహాయోగి మహాభక్తుఁడు జన్మించి వంశమును దరింపcజేయు నటు లీ టెంకాయయు దీనిc గన్నతల్లిని దరింపc జేయకుండునా? టెంకాయవలన మనము నేర్చుకొనcదగిన వనేకములు గలవు. అవి పద్యములందుc గాననగు.

**లక్ష్మీదేవి :–** కొబ్బెర లేక నీరు యెండి సగము పగిలిన చిప్పకేమి సేవ యేమి? పుణ్య మేమి?

**తండ్రి :–** ఈ విషయమున నొక శ్లోకము స్ఫురించుచున్నది. ఒకనాఁడు నారదుఁడు భూలోకయాత్ర చేయు చుండ నొకచోట నొక పుఱ్ఱెను జూడ దానియందు,

**శ్లో. జన్మ ప్రభృతి దారిద్ర్యం, శతవర్షాణి జీవితమ్ ।**
**నదీ తీరేచ మరణ, కించిద్భోగం భవిష్యతి.**

అను శ్లోకము కానవచ్చెను. దానిని జూచి చచ్చినపిమ్మట భోగమేమిటి యనుకొని బ్రహ్మవ్రాతకు నవ్వుచు దానిని దీసికొని బ్రహ్మలోకమునకుcబోయి బ్రహ్మపీఠముపై నుంచి దీనిని జదువు మనెను. ఆయన తటాలునc గ్రిందికిc ద్రోచి యేమి నీ సందేహము చెప్పుమని నారదు నడిగెను. చచ్చినపిమ్మట భోగము వ్రాసితివే యిది యేమిభోగ మనుభవింపc గలదని యాయన బ్రహ్మ నడిగెను. తొలుతc బుఱ్ఱెతాcకరానిది. అట్టి దానిని నీవు తాcకుట యీ లోకమునకుc దెచ్చుట నా సింహాసనముపై నుంచుట నేనుc దాcకి త్రోయుట యివి యన్నియు నేమని బ్రహ్మయడిగెను? దీనికా యనుభవజ్ఞానము గలదా యని నారదుc డడి గెను. **' సర్వస్య గాత్రస్య శిరం ప్రధానమ్ '** కావున శిరస్సు సుఖ మనుభవించిన దేహమంతయు ననుభవించి నట్లే యని బ్రహ్మచెప్పెను. అట్టులే యీ టెంకాయచిప్పయును.

దీనిని నేను బట్టుకొని తిరుగనేల? వేనవేలు రూప్యముల నిది శ్రీరామునకై ధరింపనేల? దీనిపై నీ గ్రంథసృష్టియేల? మీ యందఱ కరుణార్ద్రదృష్టి కిది పాత్రము కానేల? తుదకు శ్రీరామచంద్రుల చరణార విందంబుల సన్నిధి నిలువనేల? ఇవి యన్నియుc బూర్వపుణ్యవి శేషంబునc గాక మఱిదేనిచే నగు? శ్రీరామునకు లక్ష్మణునివలె

శ్రీరామ కైంకర్య కార్యంబున నాకు దక్షిణ బాహువైన బ్ర ॥ శ్రీ ॥ ముడిపిరి వేంకటసుబ్బరావు నాకిట్టి చిప్పలు నాలుగైదుచేసి యిచ్చెనుగాని యందుఁ గొన్ని పగిలిపోయెను. కొన్ని మావారు చింతకాయతొక్కు నకు వేసికొనిరి. ఇది మాత్రమే భగవత్సేవకు – భాగవత పారతంత్ర్యమునకుఁ బాలుపడెను. ఈ రెండును నాకును వేంకటసుబ్బారావునకును జన్మజన్మాంతరముల భగవంతుఁ డను గ్రహించునుగాక.

**లక్ష్మీదేవి :–** జ్ఞానములేక ముక్తి లేదంటివే నీ చిప్పకు జ్ఞానోదయమైదా?

**తండ్రి :–** జ్ఞానోదయముకూడ దైవానుగ్రహము లేక కలుగదు. మన మెంతశ్రమించినను భగవత్క టాక్షమున కుఁ బాత్రుల మగువఱకు శ్రేయస్సు లేదు. స్వయంకృషివలననే మోక్షము గందు మనుట కల్ల. కావుననే భక్తి ప్రపత్తులు తప్పఁ దక్కి నవన్నియు యోగసిద్ధులు లోనైనవి యహంకారకారణములై యధోగతులపాలు చేయఁ జాలియున్నవి. కావున నవి యన్నియు సాపాయములు.

భగవత్క టాక్ష మెన్నఁ డెట్లువరిమీఁద నేల వచ్చునో యెవ్వరు నెఱుఁగరు. ఏజీవిపైనైన నెప్పుఁడైన భగవత్క టాక్షము పాఱవచ్చు ననుటకు శ్రీమద్రామాయణ శ్రీభాగవతములే ప్రమాణములు. ఎట్ల నెదవా? శ్రీభాగవతమును బరిశీలింపుము. అందుండునవి యన్ని యన్ని చిల్లరకథలు. పరస్పరసంబంధము లేనివని తలంపకుము. భగవత్క టాక్ష మెన్నివిధముల నెవరిపై వచ్చునో యవి యన్నియుఁ దెలుపునది భాగవతము తొలుత భారతము వ్రాసి దుఃఖించుచున్న వ్యాసుఁడు భాగవతమువ్రాసి సంతసించెను. కావున భగవత్క థలు వ్రాయుటచేతను దరింపవచ్చును. భగవత్క థలనుటచే గ్రంథము లనియే కాదు. భగవన్నామము శ్రీరామకోటి వ్రాసియును దరింపవచ్చును. పరీక్షిన్మహారాజు భాగవతము విని సంసారమును దరించెను. కావున భగవత్క థలు వినుటచేఁదరింపవచ్చును. శుకుఁడు భాగవతమును గీర్తించుటచేఁ దరించెను. <u>అట్టులే కేవల భగవన్నామకీ ర్తనమే ముక్తిప్రదమగును.</u> నారదుఁడు గురుసేవఁ జేసి కృతార్థుఁడయ్యెను. భీష్ముఁడు భగవత్సన్నిధిఁ బ్రాణము విడిచి తరించెను. పతితుఁడైన యజామిళుఁడంతిమస్మరణముచే ధన్యుఁ డయ్యెను. ఇట్టులు దేవహూతి, పృథుచక్రవర్తి, యంబరీషుఁడు, గజేంద్రుఁడు, ప్రహ్లాదుఁడు, ధ్రువుఁడు, గోపికలు, మద్దిచెట్టులు, బృందావన పక్షి మృగ వృక్షములు, పూతన, బ్రాహ్మణస్త్రీలు, గోపాలురు, సాలెవాఁడు, కంసుఁడు, శిశుపాలుఁడు, అర్జునుఁడు, ద్రౌపది, జటాయువు, నందలి యన్నిజీవులు, రాక్షసుఁడైన విభీషణుఁ డు, ఆయనమంత్రులు, కుబ్జ మఱియు ననేకులు పెక్కు కారణముల భగవత్క టాక్షమునకుఁ బాత్రులైరి. ఇవన్నియు వివరముగాఁ జెప్పవలయు ననిన నొకపెద్దగ్రంథ మగును. కావున భగవత్క టాక్ష ముత్తమోత్తమ బ్రాహ్మణులందే వచ్చునుగాని తక్కి న వారియందు రాదను నియతిలేదు. ఈ టెంకాయచిప్ప పూర్వజన్మమున నేమిగా నుండి యేతపోభంగముచే గజేంద్రునివలె నిట్లయ్యెనో రాఁగలజన్మంబున నెట్లుండగలదో యెవ్వఁడెఱుఁ గును. భక్తి ప్రపత్తులు నిశ్చయ నిరపాయ మార్గములు. శుష్క వేదాంతములు భ్రష్టులుగాఁగోరువారి కుండ నిమ్ము. అవి మనపగవారికగును గాక. యోగసిద్ధులు మహిమసంపాదింపఁగోరువారి కుండనిము. కర్మ నిష్ఠలు వైదికులకుండనిమ్ము. మనము దేనికిని సమర్థులముగాము. ఈటెంకాయచిప్పవలె భగవత్పారతంత్ర్య మున భాగవతపారతంత్ర్యమున మనము నిజముగఁ గడతేఱుదము. <u>రామభజనము చేయుదుము. రామ నామము నోరుకాయగాయ వల్లింతుము. రామకైంకర్యము చేయుదము. రామకథలువిందము, నిజమైన సాధువులు దొరకిరేని వారి పాదసేవ చేయుదము. వారి పాదధూళిశిరమున వహింతము. వారిపాదతీర్థము గ్రహింతము. సర్వము సీతారామ మయముగఁజూతము.</u> చాలు. మనకు వేఱొండుదానితోఁ బనిలేదు. యోగసిద్ధవలదు, ధర్మనిష్ఠవలదు. కర్మనిష్ఠవలదు. ఆత్మజ్ఞానమువలదు. ఎవరిమేలు నేను గోరుదునో నా మే లెవరుగోరుదురో వారికందఱకు నేను బోధించునది యిదియే.

**శ్లో. న ధర్మనిష్ఠోస్మి న చాత్మవేదీ, నభక్తిమా౯ త్వచ్చరణారవిందే**
**అకించనోనన్యగతిశ్శరణ్య ! త్వత్పాదమూలం శరణంప్రపద్యే**

**శ్లో. సంధ్యావందన భద్రమస్తు భవతేభో స్నాన తుభ్యం నమః**
**భోదేవాః పితరశ్చ తర్పణవిధౌ నాహం క్షమః క్షమ్యతామ్**
**యత్ర క్వాపి నిషద్య చేతసి యదూ త్తంసస్య కంసద్విషః**
**స్మారం స్మార మఘం హరామి తదలం మన్యే కి మన్యేన మే**

**శ్లో. సర్వధర్మా౯ పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ**
**అహంత్వా సర్వపాపేభ్యో, మోక్షయిష్యామి మా శుచః.**

**శ్లో.** **సకృదేవ ప్రపన్నాయ, తవాస్మీతిచ యాచతే**
**అభయం సర్వభూతేభ్యో, దదా మ్యేతద్వ్రతం మమ ॥**

**శ్లో.** **సర్వకర్మాణి సంత్యజ్య, సర్వకర్మఫలాని చ**
**శరణ మాం ప్రపద్యస్వ, సర్వబంధవిముక్తయే ॥**

**శ్లో.** **సత్యం బ్రవీమి మనుజాః స్వయ మూర్ధ్వ బాహుః**
**యో మాం ముకుంద నరసింహ జనార్దనేతి**
**జీవన్ జప త్యనుదినం, మరణే ఋణీవ**
**పాషాణకాష్ఠసదృశాయ, దదామి ముక్తిమ్ ॥**

**చం.** **అరయఁగ భక్తపాలనములైన భవద్గుణజాల మాత్మనం**
**స్మరణముసేయ, వాక్కు నిను సన్నుతిసేయు, శరీర మెల్లఁగిం**
**కరపరివృత్తి సేయమదిఁ గాంక్షయొన ర్చెదఁగాని యొల్లనే**
**నరిదిధ్రువోన్నతస్థలము నబ్జజుపట్టన మింద్రభోగమున్.**

**కం.** **ధీరులు నిరపేక్షులు నా**
**త్మారాములునైన మునులు హరిభజనము ని**
**ష్కా రణమ సేయుచుందురు**
**నారాయణుఁ డట్టివాఁడ నవ్యచరితా.** **భాగ.**

వాయుదేవకృత భగవత్స్తోత్రమం దిట్లు గలదు.

**శ్లో.** **వ్యాప్తిం మమేదంచ శరీరమధ్యే । చతుర్ముఖసై ్యవ న చన్తదన్యే**
**మదీయ నిద్రా తవవందనం ప్రభో । మదీయ యాత్రాచరణం ప్రదక్షిణమ్**
**మదీయవాగ్వా ్యహరణ స్తుతి స్తవే । త్యేవం విదిత్వాచ సమర్పయామి**
**మద్ద ృష్టి యోగాంశ్చ పదార్థ జాతాన్ । దృష్టా ్వ హరిప్రతిమా ఏవదేహి**
**మత్వాప్యహం సర్వదా దేవదేవ । తత్రస్థితాన్ హరిరూపాన్ భజిష్యే**
**యచ్చందనం యచ్చపుష్పం చ ధూపం । వస్త్రంచ యద్భుక్ష ్య భోజాదికంచ**
**ఏతత్సర్వం విష్ణు ప్రీత్యర్థమేవ । హ్యేతద్భూతం సర్వదాఽహంకరిష్యే.**

నీకు నిశ్రేయసమందుఁ గోరిక గలదేని యీ వాక్యములు నీకుఁ బ్రమాణములగును. భగవంతుఁడు మిమ్మనుగ్రహించును గాక.

తల్లీ ! నీ కొక కడమాట చెప్పెద వినుము. దీని నీవుపేక్షింపకుము. మఱవకుము. అతిసులభ మగుటచే నుదాసీనవుగాకుము. జ్ఞానముచే నీవు సర్వజ్ఞుని మెప్పింపలేవు. నీ జ్ఞాన మెంత నీ వెంత. ఆయన మహిమ యాయనకే తెలియరానంతటి యపారము. నీ వేమి తెలిసికొనఁగలవు? ఎవరేమి తెలిసికొనఁగలరు? యాగాది కర్మములచేతనే, దానధర్మములచేతనే నీవు మెప్పింపలేవు. ఆయన నీ పాండిత్యమును జూడఁడు. నీ మాట చమత్కా రమున కానందింపఁడు. నీ రూపలావణ్యాదుల కుల్లాసము గనఁడు. నీ ముద్రలకుఁ జిక్క ఁడు. ఆసనములఁ గట్టుపడఁడు. నీవు సభ నెక్కి చేతులు త్రిప్పుచు నభినయించుటకుఁ బరితోషము నొందఁడు. నీ తల చూడఁడు. నోరు చూడఁడు. హృదయమును బరిశీలించును. హృదయ గుహలో, ఆ చీఁకటిలో స్నేహయుక్తమై భక్తియనెడి దీపము మిణుక్కు మిణుక్క నియైన వెలుగుచున్నదా లేదా యనియే చూచును. అది లేదేని యాహృదయ గుహయందు, ఆ శూన్య గృహమందు, ఆ పాడింటిలో ఆ చీఁకటి కొంపలో భగవంతుఁడు ప్రవేశింపఁడు. నిలువఁడు. నీకు ఓనమాలు రావలసిన పనిలేదు. పుస్తకములతోఁ బనిలేదు. శాస్త్రజ్ఞానము వలదు. పాండిత్యము వలదు. వాచాలత్వము వలదు. వాగ్మిత్వము వలదు. సభల యందు నాట్యమాడఁబనిలేదు. అభినయింపఁ బనిలేదు. వేషములతోఁ బనిలేదు. భాషలతోఁ బనిలేదు, యాగాదులు దాన ధర్మములు చేసితివా యాయనకుఁ బ్రీతిగాఁజేయుము. శ్రీరామమార్పణమ స్తనుము. శ్రీకృష్ణార్పణమ స్తనుము. బ్రహ్మార్పణమ స్తనుము. నీ పుత్రునియందుఁ గల ప్రీతి

శ్రీరాములపై నుంపుము. నీ పతియందుగల భక్తి కృష్ణునందు నిలుపుము. నీ సొమ్ములు చీరలయం దుండు ప్రీతి నారాయణునందు నిలుపుము. నీ పుత్రుఁడే రాముఁడనుకో. నీభర్తయే కృష్ణుఁడనుకో. నీ యాటబొమ్మలే లక్ష్మీనారాయణు లనుకో. రామా యని బిడ్డను బిలువుము. కృష్ణా యని పతిని బిలువుము. చాలుఁజాలు. వేఱొండు వలదు నమ్ముము. వీరి మాటలు వారి మాటలు విని చెడిపోకుము. ఈ సమాజములు ఆ సమాజములు నిన్నుద్ధరింప లేవు. నిన్ను రక్షింపలేవు. నిన్ను బాగుపఱుపలేవు. రహస్యముగా నెవ్వరైన నేమైనఁ జెప్పెదమనిరా వారు దొంగ లనుకొనుము. సర్వత్రయుండు దేవుని విషయములో రహస్యమేమిటి? డబ్బడిగిరా వారు కామదాసు లనుకొనుము. దేవుఁడు లంచగొండికాఁడు. ఆయనకుఁ దొలసిదళము చాలును. మంచి నీళ్ళు చాలును. అవి లేకున్న నొక నమస్కా రము చాలును. తల్లీ ! భగవంతుఁడు త్రిసత్యుఁడు. మూటికి ముమ్మాటికి సత్యము చెప్పుచున్నాను. పరులు చెప్పినారని చెప్పను. తెలిసి చెప్పుచున్నాను. సర్వదా రామనామము స్మరింపుము. కృష్ణుని బూజింపుము, నారాయణు ధ్యానింపుము. ఇంతకు మించిన మంత్రములేదు. తంత్రము లేదు. నీకు బాగుపడవలయునని కోరికగలదా నేఁటినుండి యీ గడియనుండి యీ నిమిషము నుండి యిటుచేయుము. ఇదియే వేదబోధ. ఇదియే శాస్త్రబోధ. ఇదియే గురువాక్యము. ఇదియే భగవద్వాక్యము. చెప్పవలసినది చెప్పితిని. తరువాత నీ ప్రారబ్ధము కొలఁది పొమ్ము. ఆయనయే నీకుఁ దండ్రి. ఆయనయే నీకుఁ దల్లి. ఆయనయే నీకుఁ దోడు. ఆయనయే నీకు నీడ. ఆయనయే నీకు భర్త. ఆయనయే నీ కిల్లు. ఆయనయే నీకుఁ ద్రాత. ఆయనయే దాత. ఆయనయే నీకు మిత్రుఁడు. ఆయనయే నీకుఁ బుత్రుఁడు. నమ్ముము నమ్ముము. నమ్మకుండినఁ జెడుదువు. ఇదియే కర్మయోగము. ఇదియే జ్ఞానయోగము. ఇదియే భక్తియోగము. ఇదియే నిజమైన వేదాంతము. తక్కి నది ప్రాణాంతకము. ఆయనకంటె దయగలవాఁడు లేఁడు. ఆయనకంటె నాప్తుఁడు లేఁడు. ఆయనకంటె దగ్గఱచుట్టము లేఁడు. ఆయనయే సర్వధారకుఁడు. ఇంతవఱకు రక్షించినవాఁ డాయనయే. ఇప్పుడు రక్షించువాఁ డాయనయే. ఇకమీఁద రక్షింపఁగలవాఁ డాయనయే. నీ వాయనసొత్తే. నీ దాయనసొత్తే. సర్వము వాసుదేవుఁడే. ఆయనయే శ్రీరాముఁడు. ఆయనయే శ్రీకృష్ణుఁడు. ఆయనయే నీ భర్త. నీ భర్తయే శ్రీకృష్ణుఁడు.

ఇట్టి భావన నీకుఁ దరణోపాయము. తక్కి నది మరణాపాయము. ఇఁక నీ యిష్టము.

**వాసుదాసుఁడు.**

శ్రీరామాయనమః

# టెంకాయచిప్ప శతకము.

## ప్రథమ భాగము.

**(6-4-1925 నందు నొంటిమిట్టలో శ్రీకోదండరామస్వాముల యెదుట సభలోఁ జదువఁబడి యిది యాయన కర్పింపఁబడెను.)**

గీ. ఆంధ్రవాల్మీకి హ స్తంబునందు నిలిచి
రూప్యములు వేనవేలుగఁ బ్రోగుచేసి
దమ్మిడైనను వానిలో దాఁచుకొనక
ధరణిజాపతి కర్పించి ధన్యవైతి
కలదె నీకంటె గొప్ప టెంకాయచిప్ప. 1.

గీ. కలుగవే కోట్లకొలఁది టెంకాయ లవని
వానిలో నొక్కటైన నీవాసి గనెనె ?
నిచ్చ రామపదాబ్జ సన్నిధిని నిల్చి
మచ్చికను మచ్చరితమును ముచ్చటింపు. 2.

గీ. చేతిదోడుగ నిన్నాళ్ళు చిప్పమిన్న
గ్రాలితివి నాకు ; నింక నీ గాసిదీఱ
నిలుము రామ పదాబ్జ సన్నిధిని సతము ;
నేను వచ్చెద వైళంబ నీకుఁ దోడు. 3.

గీ. కాలినడకల నామడల్ లీలగాఁగ
నడచు వేళల, నేలపై నడవులందు
మేను వ్రాల్చిన వేళఁ, గౌపీనమాత్ర
ధారినై తిర్గువేళ, నోనారి కేళ
ఫలను వినుఁ బాయకుండుట నిలుపు మదిని. 4.

గీ. వేలకొలఁదిని రూప్యముల్ విడిచి, శుష్క
తృణముగా నెంచి నామేడయిల్లు వదలి
మేలి జలతారు నలువలు కాలఁ దన్ని ;
నిన్ను గ్రహియించితిని గాదె నిమ్మిఁజిప్ప. 5.

కం. విడిచితి సర్వ ధనంబులు;
విడిచితి భోగంబులెల్ల విషయసుఖంబుల్;
విడిచితి నిల్లును భూమియు;
విడువను గద నిన్ను నెట్టి వేళలఁ జిప్పా. 6.

గీ. జారలట్టుల వెండి బంగారు లెల్లఁ
బరమనంబుల లోఁగొని వారివెంటఁ
జెప్పకయ పోవు, నీవు నో చిప్పమిన్న !
సతి విధంబునఁ బాయవే సమయమునను. 7.

గీ. రాముకోవెల పునరుద్ధరణముసేయ
బాస టగుదుమ యన్నట్టి వారలందు
నడుమనే రాలిపోయిరి బడుగు లెల్ల
నీవ చేదోడ వగుచును నిలిచి తౌర. 8.

గీ. ముడిపిరి సుబ్బారాయఁడు
సుడియక యా యాకెపాటి సూరారెడ్డిౘ
గడుకొని యిరు హస్తంబుల
వడువునఁ బనిసేయ రాముపని నెఱవేఱౘ. 9.

గీ. నడికి రేయైన విసువక తడవుకొనక
లేదు నా కొక వేవు రేౘ లీలగాఁగ
నతిథులకును మఱియు నభ్యాగతులకుఁ
దనియ నన్నంబుఁబెట్టు సీతమ్మ నాకుఁ
దోడుగాకున్న నింతయుఁ గీడుపడదె
యామె కపవర్గ మిందు దీర్ఘాయు విడఁగ
రాముతోడుతఁ జెప్పు మీ రాగమునను
గలితగుణముల కుప్ప టెంకాయచిప్ప. 10.

గీ. సుమతిఁ జాగంటివారి పాళెమున జనులు
నల్ల రేలంగివారు వే లర్పణంబు
సలపినప్పుడు గుండ్లూరి జనులు కొట్ట
వచ్చినప్పుడు హెచ్చును లొచ్చులేక
సమత నుండితి వశమె నీ శాంతి పొగడ. 11.

గీ. ఎట్టిదశయందు నున్నఁ దా రెట్టి దేశ
మందు నున్నను రాజాన్వయంబు వార
లాత్మకులగౌరవంబుల నధికతములు
గాఁగఁ గన్గొంటి గాదె టెంకాయచిప్ప. 12.

గీ. జలమును గడ్డి యర్పించి చందనంబుఁ
బూలఁ బూజించి పదముల వేలకొలఁది
వ్రాలి, రొకరైనఁ జూచి శిరంబు నీళ్ల
చల్లమికి నేమి తలఁచితి వుల్లమందు
నాళికేరింపుఁ జిప్ప గుణాళి కుప్ప. 13.

గీ. రాము నానతిఁ దలఁ దాల్చి గ్రామపర్య
టనము గావించుటం గాదె సనయముగను
భక్తురాంద్రను ధన్యులౌ పద్మముఖుల
దర్శనము చేయు భాగ్యంబు దనరె నీకుఁ

గలికి గుణములతిప్ప టెంకాయచిప్ప. 14.

గీ. అంఘ్రిసంక్షాళనమున నా కబ్బినట్లు
దానవేళల సాధ్వులౌ మానవతుల
పరమ పావన హస్త సంస్పర్శ నీకుఁ
గలిగె ధన్యతఁ గంటి టెంకాయచిప్ప. 15.

గీ. పల్లెటూళ్లల పడుచులు పాదములకుఁ
బ్రణుతి సేయుచుఁ దమ కరవాఁడిగోళ్ల
గాయములు పడఁ బొడువఁ దెంకాయచిప్ప
నొచ్చుకొంటివొ నవ్వితో నుడువు నిజము. 16.

గీ. దండములవలె వ్రాలి పాదముల జనులు
తలను ద్రిప్పుట మాఱు పిఱ్ఱలను ద్రిప్ప
నిట్టు లట్టులు; నది గని పట్టరాక
నవ్వితో మునివైతివో నయముదోఁప. 17.

గీ. మచ్చెకంటులు హారతు లిచ్చి పాద
మెచ్చితో వారి గురుబుద్ధి సచ్చరితము ?
రాము మహిమంబు శ్లాఘింతో ? రాజసమున
గర్వపడితివొ చెపుమ టెంకాయచిప్ప. 18.

గీ. పాద సంక్షాళనంబు నభ్యర్చనంబు
రామునకె నాకుఁ గాదని నామనమున
నేను ధ్యానించునట్టులు నీవు నీవి
నీకుఁ గాదని తలఁతు వె నిపుణమతిని. 19.

గీ. రాముకై ఒకర్య మనఁగ సారాయి కల్లు
త్రాగుటయె ? యని ప్రశ్నించు త్రాగుఁబోతు
తొత్తుకొడుకును నెందైనఁ దోఁచెనేమె
కడపపురమునఁ దప్పఁ దెంకాయచిప్ప. 20.

గీ. మోసగాఁడను మాయావి ముచ్చటంచు
నన్ను నిందించు వారల నెన్నఁడేని
నింతదేశంబు తిరిగి యెందేనిఁ గంటె
కడపురమునఁ దప్ప దెంకాయచిప్ప. 21.

గీ. చేసెదము సాహ్యమని బాసచేసి వ్రాసి
కార్యమున దించి వెనుదీయ కఠినమతుల
నింత దేశానఁగంటె నీ వెన్నఁడేనిఁ
గడపమండలిఁ దప్పఁ దెంకాయచిప్ప. 22.

గీ. రాజవదనలు మంగళారాత్రిక లిడి
శ్రావ్యముగఁ బాట పాడంగఁ జతురరీతి
నీమనంబెందు నిలిచెనో నిజము చెపుమ
రాములందునొ శ్రీ రఘురాములందొ. 23.

గీ. అంతరంగంబు శూన్యమై యమరుఁ గాదె
యోగులకుఁ బోలె నాకని యు త్తరంబు
నిడుదె? యో చిప్ప శ్రీరాము నిందువదన
యాకృతులుగాఁగఁ దో చి రౌ నల్ల వారు. 24.

గీ. అంపమునఁ గోఁతపడితివి రాముసేవ
కర్త మగుటకు నీకం టె నధికుఁ డెవఁడు ?
కష్టముల కోర్వకున్నను గల దె సుఖము ?
నాళికేరంపుఁ జిప్ప గుణాళి కుప్ప. 25.

గీ. తల పదంబులపై నీసు దాల్చుఁ గాని
కువలయాక్షుల కరవాఁడి గోళ్ళ కాట్లు
నిసుకరాపిళ్ళ సలసల మసలు నీళ్ళు
చెంబు పోట్లును సైఁ చునే చిప్ప ! చెపుమ. 26.

గీ. తల పదంబులపై నీసు దాల్చుఁగాక
ముండ్ల వంకల దొంకల గుండ్ల ఊల
మండు నెండల నదియెట్లు మలయఁగలదు?
కష్టి కే కద పూజ్యత కలుగుఁ జిప్ప. 27.

గీ. పగిలి నెత్తరు గాఱిన బాధ యనక
తుమ్మముండ్లను బల్లేర్లఁ ద్రొక్కి కడపఁ
గడప జో మె త్త నిల్వఁగఁ బడుచు గాసి
గన్న యవి కాళ్లు కావె టెంకాయచిప్ప. 28.

కం. నావంటి భిక్షుకుఁడు సీ
తా విభునిం బోలు మేలి దైవంబు మఱి
నీవంటి టెంకి చిప్పయు
భూవలయమునందు సున్న పున్నెపుఁ గుప్పా. 29.

గీ. అల్ల శ్రీనాథుఁ డాదిగా నాంధ్రకవులు
దిగ్విజయమునఁ దిరిగిరి దేశ మెల్ల
రామభిక్షకునై యాంధ్రరాజ్య మెల్లఁ
గాలి నడ సంచరింతుఁ దెంకాయచిప్ప. 30.

గీ. ముక్క ఒటివి గాకుండిన
నిక్కె వడి రామసేవ యితరుల వశమే
నిక్క పుభ క్తి శ్రమింపఁగఁ
జక్క ని టెంకాయచిప్ప సరసపుఁదిప్పా. 31.

గీ. కఠిన పాకంబునకు నిన్నుఁ గవులు పోల్చి
పలుకుదురు గూఢ రసమని వయసువాఁడు
గట్టి చెఱకును సమలంగఁ గలఁడుగాక
దంతహీనున కదియ సాధ్యంబకాదె? 32.

ఉ. పిన్నటనాఁట మానవులు పెంచిరవేవొ జలంబు పోయుచున్
ని, న్నది మానసంబునను నిల్పి దృఢంబుగ నీవు నిర్మలం
బు న్నె ఱతీపియున్ సుధనుబోలిన నీరము లెల్ల కాలము
జెన్నుగఁదాల్చి శీర్షమునఁ జేర్చెదు వారికి నారికేళమా. 33.

గీ. కృతము నెఱిఁగిన దానవంచెఱిఁగి కాదె
యెల్ల వేల్పులు నిన్నె గ్రహించుచుంద్రు
గుమ్మడులు లీవె నీకంటె గొప్పమేను
దాల్చి ? వేల్పులు వానిని దాఁకువారె? 34.

గీ. ఫలము దానంబుగా నిచ్చు పట్టులందుఁ
బరుల నాశీర్వదించెడి తరుణమందు
మిన్నగా నెంత్రు జనములు నిన్నె కాదె?
కారణంబేమి చెపుమ టెంకాయచిప్ప. 35.

గీ. జీవ మున్నప్పుడును బోలె జీవ మెడలి
చేయుచున్నావు దేవునిసేవ నీవు
అందునిందును ఫలమొండె ననెడుమతముఁ
గంటివే యు క్తమనుచుఁ డెంకాయచిప్ప. 36.

గీ. భ క్తియోగంబునను ధర బ్రతుకువేళ
స్వామికై ఒకర్య కార్యంబె సాధనంబు
ము క్తిదశయందు నద్దియే సక్త మగును
వాసి గలుగద యిట నట వాస్తవంబు. 37.

గీ. జపము లేటికి గాటంపుఁ దపము లేల ?
నిష్ఠ లేటికి వ్రతముల నియతులేల ?
నీవిధంబున భగవంతు సేవసేయఁ
గలుగు టబ్రంబె ము క్తి టెంకాయచిప్ప. 38.

గీ. అగముపై నిల్చి నయనత్రయంబుఁ దాల్చి,
పావనాంబువులను మోచి, పైన బొంత
గప్పు నీకును శివునకుఁ గలదె వాసి
కమ్రగుణములకుప్ప టెంకాయచిప్ప. 39.

గీ. పాదప్రక్షాళనముచేసి వారిఁగొనినఁ
దేలువిషము హరించెను, దీఱె నాంధ్య
మహహ దయ్యంబు లూఁగెను వ్యాధి దొలఁగెఁ
జిత్ర మిది కంటివేకద చిప్ప నీవు. 40.

గీ. పాదసంచారినై గ్రామపర్యటనము
సలుపుదును లొ భ్యమున నని పలుక నొకఁడు
వీనులారంగ నీవును వింటిగాదె
చిత్ర మింతకుఁ గలదేమి చిప్పమిన్న. 41

గీ. కూడు కొలఁదిని నమ్మెదఁ గుండల నని
పలుకువారల మతికేమి పగిది వగతో
యెట్టిమతి హీనమయ్యె మహీసురాళి?
కలిమహత్త్వంబు కలిమిఁ డెంకాయచిప్ప. 42.

గీ. సాధుచిహ్నంబె జ్ఞానంబు సన్నగిల్లె,
భక్తి లక్షణ మెఱుఁగరు పాపమతులు
వాగుచుందురు నోటికి వచ్చినట్లు
కాలమహిమంబుఁ జేసి టెంకాయచిప్ప. 43.

గీ. అల్ల రెలంగిలో నిర్వు రన్నదమ్ము
లధిక మెది యొంటిమిట్టయో యల్ల భద్ర
శైలమో యని వాదింప స్వప్నమందుఁ
గొలుఁడు నన్నని మనవేల్పు పలికెఁ గాదె
కంటె మనరామమహిమ టెంకాయచిప్ప. 44.

గీ. ప్రముఖు లెల్లరు ధర్మవరంబునందు
రామునకు బియ్య మార్జింప రాదటన్న
వైశ్యకన్య గోవిందమ్మ వాసి చెలఁగఁ
బట్టి సాధించెఁ గంటివే భ క్తిమహిమ. 45.

గీ. రాముసేవకు మనతోడ రాత్రిపగలు
శ్రమము నెంచక తిరిగిరి సాధుజనము
లైన కొండూరుశివరాజు నకపనాయఁ
డల్ల గుండాల రెడ్డియు గొల్లనరుసు
గుత్తి వెంకోబరాయఁడు కూర్మిరామ
చంద్రపదముల నీ వున్నసమయమునను
వీరి పేరుల నెఱిఁగింపు నారి కేళ
కర్పరమ మఱపొందినఁ గలుషమొదవు. 46.

గీ. ఆత్మ జంకును గొంకును స్వాభిమాన
మెల్ల విడనాడి స్వామి కహీనమతిని
శ్రమము పడినట్టి యా శివరావు రాఘ
వయ్య కృష్ణయ్య స॥ శ్రీనివాసరావు
సుబ్బశాస్త్రి సుబ్బారెడ్డి సూరినుతులఁ
బ్రోవఁ జెప్పుము మన రఘుపుంగవునకుఁ
జెప్పకున్నఁ గృతఘ్నుతఁ జెడెద వీవు. 47.

గీ. తాళ్ళపాకను మట్టమధ్యం దినంబు
నందు వేసంగి పడఁబడి యడలువేళ

నాకు నెళనీ రొసంగిన నాతిమిన్న
రాచకూఁతును రామక్క రమ్యశీలఁ
బలుక మఱవకు శ్రీరామభద్రుమ్రోలఁ
గలికి గుణముల కుప్ప టెంకాయచిప్ప 48.

గీ. దూరమేగెదు కాల్నడ, ఘోర తరము
లెండ లిప్పుడు, బడలెద, వెక్కు ప్రొద్ద
టంచుఁ బ్రార్థించి కడపటి యామమందు
మొదటిగంటను నప్పుడు పిదికినట్టి
వేఁడిపాల నొసంగిన వెలఁదిమిన్న
గుండ్ల మడనువసించును గూర్మి గలది
కృష్ణమాఖ్యను గూర్చి యహీనర క్తి
రామవిభునకుఁ దెలుపు మీ రాగమునను
గలికిగుణముల తిప్ప టెంకాయచిప్ప. 49.

గీ. చేరువైనను దవ్వై వ్వనఁ జేరవచ్చి
బిడ్డకును దల్లి పాలిచ్చు విధము దోఁప
వేళవేళకు బలవంత పెట్టి పాలు
కడుపునిండ నొసంగిన గరితలైన
లింగమయును గోవిందమ్మ సంగతులను
మహిజపతితోడఁ జెప్పఁగ మఱవఁబోకు
కలికిగుణముల కుప్ప టెంకాయచిప్ప. 50.

గీ. అల్ల చాగంటి పాళెంపు టధికభ క్తి,
యవల రేలంగి వారల యధిక ర క్తి,
పామిడిని రథవాహంబు పన్నురంగ
రాజులయుఁ బ్రీతి, ధర్మవరంబు తంతు
వాయులయు కూర్మి, శోధించి వాసి యిందుఁ
దారతమ్యంబు గలదేని తరమెఱింగి.
జానకీపతి కెఱిఁగింపు సత్యవిధము
చిప్ప నీ వైన నే నేమి చెప్పనేర. 51.

గీ. రాణమీఋ ననంత పురంబునందుఁ
ద్రిపుర సుందరియమ్మ దాఁ దిరిపెమునకు
నాకు మాఱుగఁ బోయెద ననియెఁ గాదె
రామసేవకు, నీ మహిళామతల్లి
వంటిదానిని గంటివే వసుధ యందు
క్షమ నొకరిసొత్తె భ క్తి టెంకాయచిప్ప. 52.

గీ. చెన్నపురమున నొంటిమై నున్న వేళ
వ్యాధిబాధను బరవశుఁడైన యవస
రమున శోకింపఁ జెడిపోయె రాముకార్య
మనుచు, నప్పుడు తల్లియై యరసి పథ్య
పానముల నిడి ప్రోచిన పడఁతిమిన్న
యా మహాలక్ష్మి నిత్య సౌఖ్యముల విభునిఁ
గూడి యెసఁగంగ ఘటియింపఁ గోరితి నని
దాశరథికిని జెప్పుమీ తప్ప కీవు
కలికిగుణములకుప్ప టెంకాయచిప్ప. 53.

గీ. నీవు మున్నేగు జానకీ నీరజాక్షి
విభుని పదసేవసేయ నే వెనుకవత్తు ;
వచ్చునప్పుడు తనకు నిర్వంచనముగ
సాహ్య మొనరించు సజ్జన సమితి నెల్ల
నాయెడను ర క్తి గలిగిన నాదు హితులఁ
దోడి తెత్తును సత్యంబు తోడి తెత్తు,
విన్నవింపుమ యిమ్మాట విభున కీవు
కల్ల యిది గాదు సుమ్ము టెంకాయచిప్ప. 54.

గీ. ఇంత దేశంబు తిరిగి, నే నిన్నియిండ్ల
నిలిచి కంటిని వావిలికొలను శేష
గిరి సమాఖ్యుని సంసార సరణి కెందు
సాటి లేదని చాటింపు సత్యముగను
గ్రమ గుణపాళి కుప్ప టెంకాయచిప్ప. 55.

గీ. ఎప్పిరాలను భిక్షింప నేగువేళ
నెదురుగా వచ్చి దవ్వుగా, నెరఁగి కాళ్ల
సాఁగిలం బడి బడిబడి చందనాదిఁ
బూజ గావించి భ క్తేంద్రు పోలికమరఁ
బాదధూళిని శిరమునఁ బాదుకొలిపి
కేలుమోడిచి తుద రెండణాల నొసఁగు
దొంగ కోమటి ధనికుని వంగిపోయి
కాటికిని గాళ్లు చాఁచిన కఠినచిత్తు
మాయచేష్టల కేమంటి మనసులోన
నవ్వితివొ గాక లోభితనంబునకును
జింతపడితివొ టెంకాయచిప్ప చెపుమ. 56.

కం. సామాన్యభ క్తిఁ జూపిన
యామానవులను గుఱించి యను మీర క్తిఁ౯
రామునితోఁ దజ్జనముల
సామాన్యులఁ జేయ ధరణి చక్రమునందు౯. 57.

గీ. ద్విగుణఫల కాంక్ష నొండెఁ, బ్రతిష్ఠ నొండె,
భయముచే నొండె, మఱి బలవంత పెట్టఁ
బడియొ యిత్తు రదెందున్న వైశ్యజనులు ;

ప్రతిఫలంబును గోరక మతిని నిల్పి
సదమలంబైన భక్తి నొసంగువాఁడు
వేయి కొకఁడైనఁ గలుగమి విపులయందుఁ
గంటివే కద నీవు టెంకాయచిప్ప. 58.

గీ. వేదగిరి సెట్టియును మన వెంగిసెట్టి
కడపపురిని యా దాల్ల నాగమ్మగారు
పత్తి రాఘవ సెట్టియు మెత్తమనసు
తల్పువేంకట సుబ్బమ్మ దాననిపుణ
గుత్తిపురమున జూటూరు కులజులైన
సుబ్బయార్యుండు వేంకట సుబ్బయార్యుఁ
డల్ల ధర్మవరంబున నెల్ల వైశ్యు
లిచట నాగవరంబున నెసఁగు రంగ
యాఖ్యుఁడును దప్పిపుట్టి రీ యవనియందు
వైశ్యజాతిని సద్గుణ పాళియుక్తి. 59.

గీ. అయిన నొక గుణమున్న దీ యర్యులందుఁ
నిత్తుమని చెప్పుటయె కష్ట ; మిడుటయందుఁ
దడవు సేయరు తప్పరు ; తక్కు జాతు
లిచ్చు నందాఁక నిజమని యెంచరాదు ;
చెప్పుమా నిక్క మా యిది చిప్పమిన్న. 60.

గీ. పురవరంబుల బల్లారిపురము వరము
పల్లెలందును జాగంటి పాళె మురవు
దైవభక్తిని నతిథి సత్కా రమునను
దాన గుణమున భాషాభిమానమునను. 61.

గీ. బ్రాహ్మణులకంటెఁ దక్కు వర్ణములవార
లందుఁ బురుషులకంటెను నిందు ముఖులు
భక్తిచే మిన్న లగుట సుస్పష్టపడియెఁ
గాదె యనుభవమునను డెంకాయచిప్ప. 62.

గీ. చరణముల నీటిచేత సంక్షాళితంబుఁ
జలిపి తమ పైఁటలం గొని శ్రద్ధభక్తి
శాస్త్రపద్ధతిఁ దడియొత్తు జలజముఖులు
ధర్మవరమునఁ బెనుగొండఁ దనరఁగాంచి
పూర్వులాచారములు నింకఁ బొలియ కునికి
కరము ముదమందితేమె టెంకాయచిప్ప. 63.

గీ. పైఁటలైనను మాసిన పాఁతలైన
మనకు నొక్క టె, కడుగ రేꣳ మఱియు మేలె
శాస్త్ర విశ్వాస భక్తులఁ జాటుఁగాదె
కరము హర్షంపు దానఁ డెంకాయచిప్ప. 64.

గీ. ఉర్విని వేంకటగిరి విభు
సర్వజ్ఞ కుమారకృష్ణ చంద్రుని మహితా
ఖర్వ శుభాకరుఁ జేయఁగ
నుర్వీజా రమణుతోడ నొప్పుగ ననుమీ. 65.

గీ. స్వామి నైవేద్యమున కని సాధుజనుల
భుక్తి కని భూము లిచ్చిన పుణ్యతములఁ
గీర్తి ధన్యుని నల్ల ఫక్కీ రురెడ్డి
మాలెమార్పుర మంగమ్మ మహితగుణను
భూరి సౌజన్య ధనుని దుత్తూరు శేష
శర్మ మఱి వెంకటప్పను సాధుమతుల
నానబాల్ నరసయ్యను మానితముగ
సతతమును బ్రోవ శ్రీరామ చంద్రుతోడఁ
గదిసి మఱియొత్తి చెప్పు టెంకాయచిప్ప. 66.

కం. మక్కువ వీర లొసంగిన
యొక్కొక కబళంబునకును నొక్కొక కల్పిల
బెక్కుడు సుఖ మిం దీయఁగ
నక్కడపట ముక్తి నొసఁగ నను రామునకుꣳ. 67.

గీ. వెండి దండంబులను భక్తి విశదపడఁగ
నర్పితము చేసినట్టి యా యన్నపూర్ణ
కనఘ చరితకు నతుల సౌఖ్యంబు లీయ
విన్నవింపుము రామ భూవిభున కీవు. 68.

గీ. దాన మిచ్చెదనని చెప్పి తప్పిపోక
సాధు బుద్ధిని నూర్ల నొసంగినట్టి
రంగసామయ్యగారిని బ్రథితశీలు ;
సదయుఁ జెంగమనాయని సాధుచరితుఁ
డైన యా చెలమారెడ్డి ననఘు గుండు
రావు నిస్తుల సౌహార్ద భావమునను
నరసి యోగంబు క్షేమంబుఁ గరుణఁ బ్రోవ
విన్నవింపుము జానకీ విభునకీవు
క్రమగుణములకుప్ప టెంకాయచిప్ప. 69.

గీ. రూఢి నిన్నూట యేఁబది రూప్యములను
లలిత గతి నిడు శ్రీమహాలక్ష్మి భర్త
సుమతి ముడిపిరి వేంకట సుబ్బరావు
బ్రోవఁ జెప్పుము శ్రీరామ భూవిభునకు. 70.

గీ. తొలుత నాకు సహాయుఁడై నిలిచి, నూఱు
రూప్యముల నిచ్చె రామభద్రునకుఁ గాఁగ
బాల్య మిత్రుఁ బెన్గొండ గోపాలరావు

శర్మ మొనగూర్ప శ్రీరామ చంద్రుతోడఁ
గరుణ తప్పక చెప్పు టెంకాయచిప్ప. 71.

గీ. ఆంధ్రవాల్మీకి రామాయణాంకితంబు
నాఁడు, నేఁడును సద్భ క్తితోడ మిగుల
గొప్ప సాహ్యంబొనర్చిన గురుమనీష
సాధుచరితుని మిత్రు వసంతరాయు
నేమఱక ప్రోవఁ బల్కు మా రామునకును
గ్రమ గుణములతిప్ప టెంకాయచిప్ప. 72.

గీ. కూటగూళ్ళ పురంబునఁ గొమరుమీఱు
సాధువేంకట సుబ్బార్య సారభక్తు
మఱియు వేంకటరామప్ప మహిత చెన్న
రెడ్డి లక్ష్మీనారాయణుఁ బ్రీతియుక్తు
సన్ను తాత్ములఁ బ్రోవంగ విన్నవింపు
క్ష్మా సుతా వల్లభునకుఁ డెంకాయచిప్ప. 73.

గీ. నన్ను వాత్సల్యదృష్టిని గన్నసతుల
మంతుమీఱిన యట్టి యనంతపురిని
శుద్ధచరితల మీనాక్షి సుందరమ్మ
మొదలుగాఁగల విదుషల విదితభక్తి
భాసురాత్మికలను శారదాసమాజ
సభ్యురాంద్రను నిశ్రేయసం బొసంగ
జానకీ నాయకుని మానసమున కెక్క c
గరము నొక్కి వచింపు టెంకాయచిప్ప. 74.

గీ. పెనుగొండ రామవిభునకుఁ
బెను సాయముఁ జేసినట్టి వెంకోబాఖ్యు
ఘను వేంకటసుబ్బార్యుని
బనిగొని ప్రోవంగఁ జెప్పవలయునుఁ జిప్పా. 75.

గీ. తాడిప ర్తి పురాన నుదారులైన
మహితచరితుల వీ హనుమంతరావు
సత్యనారాయణాఖ్యుని సాధుశీలు
శ్రీనివాచార్యుఁ గొండప్ప మానితమతిఁ
బార్థసారథి లోనగు ప్రముఖవరుల
విదితసంప్రీతిఁ బ్రోవంగ విన్నవింపు
క్రమగుణములతిప్ప టెంకాయచిప్ప. 76.

గీ. ఎండవేళల నినుఁ దెచ్చి యెలమిమీఱ
నుదకమధ్యంబునఁ వైచి యుంచినపుడు
ఆత్మలోపలఁ దలఁతు నారాయణతయుఁ
గలిగె నీకని చెప్పఁ డెంకాయచిప్ప. 77.

గీ. తావకీన గుణంబు లెద్దాని నైన
బద్ధమొనరించు, మూఁడుపక్షములు గలవు
త్రిగుణములఁ దెల్పనే ? ప్రకృతివియు నీవె
కాదె యట్లేని చెప్పఁ డెంకాయచిప్ప. 78.

గీ. గడ్డమును ద్రిప్పి నంతనే కనులక్రిందఁ
దురకతలకాయ వౌదు, భూసురుని శిరమ
వౌదు వూర్ధ్వంబునకుఁ ద్రిప్ప ; నంతవాసి
గలదని యెఱుంగఁజెప్పఁ డెంకాయచిప్ప. 79.

గీ. పక్షపాతంబు లేదు దేవతలయందు
ననుచుఁ దెలుపఁగఁ గొట్టెద రారగింప
ముందు గడ్డంబుతో, మఱి పోవఁదీయు
వారునై వేద్యసమయాన సూరులెల్లఁ
గలితగుణముతిప్ప టెంకాయచిప్ప. 80.

గీ. పుడమితనయకు నై స్వర్ణభూషణముల
నల్ల చాగంటి పాళెంబునందు ధర్మ
వరమున బెనుగొండను గరము భ క్తి
చేత రాకట్ల నిడినట్టి పూతమతులఁ
గోటిరెడ్డిని లింగమ్మ గురుమనీష
లైన శ్రీరామచంద్రయ్య యాదిగాఁగ
వైశ్యమణుల గోవిందమ్మ వరచరిత్ర
వెంగమాంబను మఱియొండు వేశ్యతరణి
మఱియు హనుమంత రెడ్డిని మమతదోఁప
నెల్ల కాలంబు రక్షింప నుల్లమిడఁగ
జనకతనయను శ్రీరామ చంద్రవిభునిఁ
గరము ప్రార్థింపుమొప్పఁ డెంకాయచిప్ప. 81.

గీ. ఉపకరగ్రాహిగా నెవ్వరున్న వేళఁ
గారుకూనను న న్నిందుగారవమునఁ
బ్రేమనరసె నొతుంపర్తి రామరాయు
సౌఖ్యసంయుక్తుఁ జేయఁ బ్రశ స్తమతిని
కడగి పలుకుము నీవు టెంకాయచిప్ప. 82.

గీ. ధర్మవరమున జలకుండిఁ దతసుభ క్తి
మెఱయ నిడినట్టి బెల్లాల చెఱువువంశ
భవుని నరసింగ రాయనిఁ బరమర క్తిఁ
బ్రోవ వచియింపవలయును బూనినీవు
కరముప్రీతి దలిర్పఁ డెంకాయచిప్ప. 83.

గీ. నవ్యరథమును గల్పించి నన్ను నిలిపి
యెన్నఁ డెఱుఁగని భజనలు చెన్నుమీఱ

బ్రహ్మరథమును బట్టిరి పామిడిపుర
జనులు రంగ రాజాన్వయ శ్యామరావు
రామసామియు వేంకటరామశాస్త్రి
మఱి మహాదేవశాస్త్రియు మహితయశులు
చిన్నపయును ముత్యాలప్ప సన్నుతుండు
నయిన శ్రీ కుమారస్వామి హనుమయప్ప
గుండురావును మిక్కి లి కూర్మివెలయ
నిండుదయతోడ రక్షించుచుండవలయు
హాయిఁ గూర్చుచు ననుము టెంకాయచిప్ప. 84.
గీ. గుంటూరుపురమునఁ గూరిమి మెఱయఁగ
రాముకార్యమునకు శ్రమముగొనిన
మన్నారు కృష్ణాఖ్యు సన్నుతశీలుని
భావనాచార్యుల ప్రథితసుతుని
నస్మత్సుశిష్యు రంగాచార్యుఁ బాల్వాయి
శ్రీ రంగ రావుఁ బ్రసిద్ధయశుని
నతులితు న్యాపతి హనుమంతరాయని
లక్ష్మీనృసింహాఖ్యు లలిత గుణుని
వేంకటప్పయ్యను వేంకటరత్నము
కొంపల్లివంశజు కోటిలింగ
ప్రఖ్యుని మఱి దేశిరాజు వంశోద్భవు
హనుమంతరాయు లక్ష్మయ్య నాయ
నిని మఱి తోలేటి ఘనుని నప్పారావు
శ్రీనివాసాఖ్యుని శ్రీ సమేతుఁ
బూతచిత్తుల నెల్లెడఁబ్రోచుచుండఁ
బూని వచియింపు జానకీ జానితోడ
నపుడె నీదు కృతజ్ఞత యవఘళించుఁ
క్రమగుణపాళితిప్ప టెంకాయచిప్ప. 85.
గీ. ప్రాపుగా నిచ్చి రల్ల రేపల్లెయందు
మఱి తెనాలిని శ్రీరామ మహిప కృతిని
బ్రథిత గుణులైన కోదండపాణి సుబ్బ
రావు మాధవ రావ్బలరామి రెడ్డి
గొల్లపూఁడి సీతారామ కోవిదుండు
వీరి కెల్ల రకును బృథివీ తనూజ
విభున కెఱిఁగింపు నిస్తుల విభవనిత్య
సౌఖ్యములఁ గూర్ప నేమియు జాగులేక
క్రమగుణముల కుప్ప టెంకాయచిప్ప. 86.
గీ. కూర్మిభ క్తియు వెలయ వేంకోబరాయ
యు క్తి మనతోడఁ దిరిగెనే యురవకొండ
యోబళాఖ్యుఁడు శ్రమమోర్చి యుల్లమలర
నమయ మెఱిఁగి వచింపు మీ క్ష్మా సుతేశ్వ
రునకు నెనలేని కూరిమిఁ బ్రోవుమనుచుఁ
గలిత సుగుణాళి తిప్ప టెంకాయచిప్ప. 87.
గీ. నిర్మల మనస్వియుఁ బినాకినీ విభుండు
సాధుశీలి రామాచార్య స త్తముండు
తనకుఁగాఁ దోడుపడిన విధంబులెల్ల
హెచ్చరింపుము శ్రీ జానకీశ్వరునకుఁ
గ్రమగుణముల తిప్ప టెంకాయచిప్ప. 88.
గీ. అల్పమైనను సద్భక్తి యతిశయిల్ల
మిగుల విశ్వాసమునను నేనేమి యిడిన
వారికిని నెల్ల వారికి గారవమున
పేరు మఱచిన తెలియనివారికెల్ల
యోగమును క్షేమ మరయంగ నొక్కి చెపుమ
కలితగుణములతిప్ప టెంకాయచిప్ప. 89.
గీ. భాగవత పారతంత్ర్యము
బాగుగ శ్రీరాముసేవ పాటిలె నీకుఁ
నీగురు సుకృతిని ; నా కే
లాగగునో పున్నియముల లప్పా చిప్పా. 90.
గీ. దాహమార్చెదు మిగులఁ దాపమునఁ బడిన
నాఁకొనినవేళ మేలి యాహార మగుదు
చమురొసం గెదు కంటికిఁ జలువగూర్ప
గలనె నిన్నెన్న నేనుఁ డెంకాయచిప్ప. 91.
గీ. గానుగున వేసి నీకెంత గాసియిడిన
స్నేహమునె చూపుదువుగాని చెట్టలేదు
దేహమునఁ బుష్టి నిడెదవు దేహి కొనినఁ
గ్రమగుణముల తిప్ప టెంకాయచిప్ప. 92.
గీ. బిచ్చమెత్తఁగ రాముకై బిడియపడవు
త్రిప్పట లవెన్ని కలిగిన దిగులుపడవు
అణువు నేనియునాత్మార్థ మవల నిడవు
కలరె నీసాటి జనులు టెంకాయచిప్ప. 93.
గీ. స్వామి నై వేద్యమునకని స్వమ్మునీయ
దారిబ త్తెమునకు నది తీరె ననియె
మనుజుఁ డొక్క ండు నాతఁడే ఘనుఁడో నీవొ
కలది వచియింపు మప్ప టెంకాయచిప్ప. 94.
గీ. అంతరంగంబు శుద్ధంబు, నతులశుచివి,

రుచి వచింపఁగ నేల యరోచకంబు
నణఁపఁ జాలెదు నీదగు గుణము పేర్మిఁ
గలదె నీకీడు జోడు టెంకాయచిప్ప. 95.

గీ. ము త్తియంబులు నీయందుఁ బుట్టుచుండు
వ్యర్థమగునది లేదు నీ యందు నెదియుఁ
బ్రథమ గణ్యవు సద్గుణ పాళి నీవు
క్రమగుణముల కుప్ప టెంకాయచిప్ప. 96.

గీ. బావిలోఁ గల నీరంబుఁ బైకిఁ దేర
నీ గుణముకాదె ముఖ్యంబు నిరుపమంబు ?
అంబుజాక్షులు కర గ్రహణంబు నిన్నె
కాదె చేయుదు రొప్పఁ డెంకాయచిప్ప. 97.

గీ. త్యాగగుణమున నీవు వఖ్యాతిఁగనుట
నీదు సాంగత్యమునఁ జేసి నేనుగూడఁ
ద్యాగినం చాదరించు జనాళులెల్ల ;
స్నేహితులఁబట్టి గుణములఁ జెప్పవచ్చుఁ
గాదె గుణముల తిప్ప టెంకాయచిప్ప. 98.

గీ. పానపాత్రంబ వైతివి, భైక్ష్యపాత్ర
మైతి, వుపధానమైతి వే నవనిఁబందు
కొనఁగ, నీనార పట్టలఁ గొమ్మటంచు
గట్టుకొన నిడరాదె టెంకాయచిప్ప
యేల యీ పుట్టగోఁచియు నే ధరింప. 99.

గీ. మాన మవమాన మను బుద్ధి మానలేద,
యెవ్వ రేమనుకొందురో యెదల ననెడి
జంకు పోలేద, నేనెంత జడుఁడ నయ్యొ
నీకుఁ గల తెంపు రవయంత నాకులేదు
కలదె ము క్తియు నాకుఁ డెంకాయచిప్ప. 100.

గీ. వాసుదేవుం డె సర్వమ౯ భావ ముండి
మైల మడుఁగను భేదంబు మానలేదు,
నీకు లేదుగ యిట్టిది నిత్యశుచివి
కలిత సుగుణాళి లప్ప టెంకాయచిప్ప. 101.

గీ. నీకుక్షిలోన నెవరే౯
బ్రాకటముగ నిడినఁ గొనెదుఁ బలుక వెవరితో
నీ కరణి నేను జేయుట
యేకామునందొ నేనె యెఱుఁగను జిప్పా. 102.

కం. ఎదివేసిన గ్రహియింతువ
యిది యది యని భేదమెన్న నెఱుఁగ వ హీ నీ
మదిచొప్పు నాకుఁ జొప్పదు
టదె యెప్పుడొ చెప్పు సుకృతి వప్పొ చిప్పా 103.

కం. ముడిపిరి సుబ్బారాయుఁడు
కడుకొను స్నేహమున నాదు కడకంపెను నీ
వడువునఁ నేఁ గావలెనని
జడమతి నద్దానిఁ దెలియఁ జాలన చిప్పా. 104.

గీ. కలరు కొందఱు నీ వెఱుంగనిమహాత్ము
లల్ల వారలఁ గూర్చయు ననఁగ వలయుఁ
బ్రాణ దాతలు పుణ్యులు ప్రాణసములు
న్యాయ నిష్ఠులు వినవె టెంకాయచిప్ప. 105.

గీ. ఆంధ్ర వాల్మీకి రామాయణాఖ్యకృతి సు
భద్ర విజయాది కృతులను బ్రకటపఱిచి
వేలకొలఁది సహాయ మేవిభుఁడు చేసె
నాంధ్ర భోజేంద్రుఁ డన నేఁడు ఖ్యాతిమెఱసె
రాజకీయ కలాశాలఁ బ్రథితరీతిఁ
బండితునిఁ జేసి కడుపారఁ దిండిపెట్టెఁ
గృతులఁ బ్రకటించి జగమునఁ గీర్తి నెఱపె
నుభయలోక సుఖంబుల నొందఁజేసె
ధరమహారాజ బిరుదానఁ దనరివాఁడు
ధరణి నిరుపమ పీఠికాపుర విభుండు
సూర్యరాయండు సజ్జన సూరి నుతుఁడు
ఆయురారోగ్యములను నితోధికముగఁ
బాఁడి పంటయు సిరులును బ్రబలుచుండ
నందు నిందును శాశ్వతానంద మొందఁ
జేసి యాయన ఋణమును జెల్లఁజేయఁ
జెప్పుమా నాదు మాటగా సీతపతికిఁ
గ్రమ గుణముల తిప్ప టెంకాయచిప్ప. 106.

గీ. పద్మనాభార్యుఁ బ్రోచిన పరమసాధ్వి
సూర్యరాయని సాఁకిన శుద్ధ సుగుణ
దాన శీలంబులందు నన్యూన చరిత
కన్నతల్లికి సరిపోవు కరుణ కలదు
కృష్ణ లీలామృతముకయి నెలమితోడ
వేయి రూప్యంబు లొసఁగి సహాయపడియె
నట్టి వీరవరాది గ్రామాధిపత్ని
రావు వంశ్య చెల్లా యమ్మరావుగారు
శీలవతియైన స్నుషతోడఁ జిరముగాఁగ
సకల సుఖముల వెలయంగ శాశ్వతముగఁ
గూర్మి నొనరింపుమీ యని కొసరి చెపుమ

వారికిని నాకు నిష్టదైవంబయైన
వసుమతీ కన్యకా ప్రాణ వల్లభునకుఁ
గ్రమగుణముల కుప్ప టెంకాయచిప్ప. 107.

గీ. మిత్రశబ్దార్థమునకును బాత్రుఁడగుచుఁ
బ్రబలరోగాన నేబాధ పడెడు వేళ
నన్నదమ్ములు చే విడనాడినపుడు
మందులనొసంగి నన్నిల మనిచినాఁడు
చెన్నపురిఁ దోడునీడయి చెలఁగినాఁడు
క్లిష్టదశ నాకు మిగుల సత్కీర్తిఁ దేరఁ
జాల శ్రమపడినాఁడు సుశీలరతుఁడు
మోసమనునది లేని విశ్వాసి వరుఁడు
ఇతరులకు మేనినైనఁ దానిచ్చువాఁడు
క్రొత్తపల్లి కులాంబుధి కుముదమిత్రుఁ
డల్ల వేంకట పద్మనాభాఖ్యు నందు
నతుల సర్వ సుఖాళి సంగతునిఁ జేయ
మహి సుతావల్లభునకును మన వొనర్పు
కలిత గుణముల కుప్ప టెంకాయచిప్ప. 108.

గీ. ఏపతివ్రత యుదరానఁ బ్రోవుగొనుట
నిట్టి బుద్ధియు శీలంబు పట్టుపడియె
నట్టితల్లికి రామచంద్రాఖ్యసతికిఁ
గనకమాంబకు నిత్య సౌఖ్యంబుఁగూర్ప
కదిసి వచియింపు నీవు టెంకాయచిప్ప. 109.

గీ. తానుగా వచ్చి రామ మంత్రంబు నాకు
నిరువదియు నొక్క యేఁటనే కరుణతోడ
నే ఘనుం డుపదేశంబు నిచ్చి మనిచె
నట్టి చేట్లూరి నారసింహార్యుఁ బ్రోవఁ
గరుణ వచియింపు మీవు టెంకాయచిప్ప. 110.

గీ. భరము సన్న్యస్త మొనరింప గురువు నరయ
నవనిజకు నాంజనేయుని యనువుదోఁపఁ
దాన వలసిన యవి యెల్లఁ దద్ద నేర్పె
వాత్స్య నరసింహ దేశికుఁ బరమకరుణ
నిందు నందును నరయంగ మందలింపు
ఘనమనీష యెలర్పఁ డెంకాయచిప్ప. 111.

గీ. ఉల్లమున భక్తి మీఱ బ్రహ్మోత్సవమున
భజన మొనరించుచును బ్రతివత్సరంబు
తన్నుఁ గానంగవచ్చెడి ధర్మరతుల
కతుల దీర్ఘాయు రారోగ్యగరిమ ముక్తి
కలుగ సంప్రీతిఁ జెపుమ టెంకాయచిప్ప. 112.

గీ. తాన మున్నిచ్చినట్టి పదార్థములను
గుండికయుఁ గౌపీనంబు దండ మొండు
తక్క c దక్కి నవన్నియు దానఁ గొనియెఁ
గొఱంత యేమియులేదు నేఁ గొదుకఁబోను
గోరె నేనియు వినినిఁ గొనుమటంచుఁ
గడఁకఁ జెప్పుమ నీవు టెంకాయచిప్ప. 113.

గీ. నీవు చేయించు కొనియెడిసేవ ఫలము
నాకు సాయం బొనర్చిన లోకులకును
బంచి పెట్టు మటంచని పలుక వలయు
జానకీ నాథుతోడ సమ్మానఫణితిఁ
సలుపుదునుగాని సేవఁ దత్ఫలముఁ గోరఁ
గ్రమగుణముల తిప్ప టెంకాయచిప్ప. 114.

గీ. గాలి బువ్వగఁ గొనుచుఁ గైంకర్యవృత్తిఁ
బ్రజకు హితముగ భూమి భరంబుమోయు
శేషువలె నన్నుఁ దన శేషుఁ జేయుమనుము
కలితగుణపాళితిప్ప టెంకాయచిప్ప. 115.

గీ. కాయగసురులు భుజియించి కడుపునించి
మనములోఁ దన్నె స్మరియించి యనవరతము
జ్ఞానదాతగ వెఱమాన్చి జనకసుతకుఁ
బ్రాణదాతగ సౌమిత్రి కాదు కొనిన
యంజనాసుతు పగిది నన్నరయు మనుము
క్రమగుణముల కుప్ప టెంకాయచిప్ప. 116.

గీ. అల్ల తిమ్మనచర్ల యం దార్యచరితు
లైన సోమప్ప సెట్టిని శ్యామరావు
మఱియు రామప్ప సంపన్న మమతఁదాల్చి
కరముఁ బ్రోవంగఁ జెపుమ టెంకాయచిప్ప. 117.

గీ. గుంతగంటిని దాము వేదాంతుల మని
వట్టి వేదాంత వాక్యముల్ వదురువారు
దానధర్మ సుశీల ధీహీనమతులు
ముడ్డికిని మూతికిని బూది పూసినారు
మద్యపానంబు మాంసంబు మరగినారు
విలువ వయసును గలిగిన విధవలకును
జూపరానట్టి దానిని జూపినారు
నీవు బ్రహ్మంబు బ్రహ్మంబు నేను మనకుఁ
గలదె భేదమటంచును గలసినారు
మగఁ డటంచును మతిగల్గు మగువలకును

రాదు వేదాంత మేమియు, లేదు బ్రహ్మ
దర్శనంబని సంస్మృతి దవిలియున్న
కులవధూతతి కొంపలు గూల్చినారు
చెలఁగు చున్నార లీ దృశుల్ సింహపురిని
గుంతకలు ప్రాంతమందును గొల్లగాఁగ ;
వీరి బారిని బడకుండ వెలఁదిగములఁ
గావుమని చెప్పవలయుఁ డెంకాయచిప్ప. 118.

క. మా రహిమునె మీరు రామా యటంద్రు
లేదు భేద మటంచు ధీలీల దనర
నెమ్మిఁ గానుకలిడిన మహమ్మదీయ
విజ్ఞులకు సర్వ సౌఖ్యముల్ వెలయఁజేయ
క్ష్మాసుతాపతి కనుమి టెంకాయచిప్ప. 119.

గీ. శ క్తికిని మించి దానంబు సలిపినారు
పేదలును సాధువులు మేలి ప్రీతితోడ
వారి నెల్లర ముున్ముందు చేరఁ దీయఁ
గరము ప్రీతివచింపు టెంకాయచిప్ప. 120.

గీ. బ్రాహ్మణులకంటెఁ దక్కు రు భ క్తిపరులు
పురుషులను మింత్రు భక్తిని బూవుఁబోండ్లు.
దానధర్మముల్ భ క్తిమతంబు వీరి
యండగొని నిల్చినవి చెడకుండ నేఁడు
వీరి నెల్ల రఁ బ్రోవంగ వేడ్క తోడఁ
జెప్పవలయును మఱియు విశేషముగను
గ్రమగుణముల దొప్ప టెంకాయచిప్ప. 121.

గీ. వీరిలోఁ గొందఱున్నారు విప్రసతులు
శ్వానముల మూతి నాకెడి మానవతులు
కాపి టి కోకో త్రాగెడు కంజముఖులు
మన సదాచార మెఱుఁగని మందమతులు
వంక పాపటలను దీయు వక్రగతులు
మాల నడతల చవి గన్న మానహీన
లాత్మజుల శూద్ర పాల్సేయు నఘచరితలు
దేహ దేవతలయిన యధీరు రాంధ్రు
వీరలకు సాధు చరితంబు దారసిల్లఁ
జేయ నగునని చెప్పు టెంకాయచిప్ప. 122.

గీ. దోష మొక్కి ంత లేదిట్టి తోయజాక్షు
లందు దోషంబు తలిదండ్రు లదియ మొదల
నవల వారల భ ర్తల యదియకాన
వారు దండ్యులు వీరల పాపములకుఁ
గల తెఱంగిది కాదె టెంకాయచిప్ప. 123.

గీ. నన్ను c గాంచిన మాత్ర నానందపరతఁ
జన్ను c బాల్గ్రోలునిసుఁగుల మిన్నయొకటి
తల్లి చంకను దిగజాఱి ధరణి కపుడ
వచ్చి దోఁగాడికొనుచు నా పదములందు
వ్రాలె నిరుమాఱు ; దాని కెవ్వారు నేర్పి
నారు తద్భ క్తి ? పూర్వజన్మమున నభ్య
సించె నేమొకొ ? యాకమ్మ శిశువునకును
దీర్ఘ మాయువు సద్భ క్తి దిటముపడఁగఁ
జేయఁ జెప్పుము పతికిఁ డెంకాయచిప్ప. 124.

గీ. బాలు రిరువురు, నాఱేండ్ల ప్రాయమంత
వారు, తమ గ్రామమునఁ బొలిమేరఁ జొచ్చి
నది మొదల్కొ ని తుదదాఁక హస్తయుగము
మోడ్చి యిరువంక నిలిచిన పుణ్య మేమొ ?
దేహరక్షకు లట్లయి తేజరిలిరి
భ క్తి యొక్క రి సొత్తౌనె ? వారిఁ బ్రోవఁ
గరుణఁ జెప్పంగ నొప్పుఁ డెంకాయచిప్ప. 125.

గీ. పాద సంక్షాళనముచేసి పైఁటకొంగు
చేతఁ దడి యొ త్తినట్టి యా చెలువ లెల్ల
వైశ్య కాంతలె, వేఱొండువారు గారు
శ్రద్ధ వసియించె నేమొ తజ్జాతియంద
శాస్త్ర సచ్ఛ్రద్ధ కల్గు నాచానలకును
యోగమును క్షేమమును గూర్చ బాగుగాను
గరుణ వచియింపు పతికిఁ డెంకాయచిప్ప. 126.

గీ. కంటి నపవాద మిప్పు డీ కదిరియందు
మహితుఁ డగు జి. సుబ్బాశాస్త్రి గృహిణియందుఁ
బుత్రశోక పరీతయై పొక్కు చుండి
శాస్త్రపద్ధతిఁ బూజించె సాధుచరిత
భ ర్తతో, నిట్టి సాధు దంపతుల కెలమి
సంపదయును సంతానంబు పెంపుమాఱఁ
జేయుమని చెప్పుమీ రఘు శేఖరునకుఁ
గ్రమగుణముల దొప్ప టెంకాయచిప్ప. 127.

గీ. నాల్గు నిరువదియౌ హరినామములను
నాల్గు నిరువదియౌ వెండి నాణెములను
బరణముల నిడి పూజలు సలిపినారు
భ క్తి వెలయఁ గూటాగూళ్ళ భ క్తజనులు
నిట్టివారల నింకెందు నే నెఱుంగఁ

చెప్పుమీ యిది శ్రీ రఘు శేఖరునకుఁ
గ్రమగుణముల దొప్ప టెంకాయచిప్ప. 128.
గీ. బాలకృష్ణుని దేవకీ లోలనేత్ర
వెన్న చేయిడి తినిపించు విధముదోఁప
నరఁటిపండును ద్రుంచి నా హ స్తమందు
నుంచి తినుమని, కరుగఁగ నుల్ల, మాడి
తినఁగఁజేసిన యా రాచవనిత కెంత
భ క్తియో కద ! యిటువంటి పద్మముఖులు
గలుగఁగాఁ గాదె భారత ఖండమింత
వఱకుఁ జెడకున్న దీయార్యవ ర్తనమున ;
నిట్టివారల నెల్లర నేలుమనుచుఁ
గరుణ పెంపొప్పఁ జెప్పు టెంకాయచిప్ప. 129.
గీ. అల్ల రేలంగిలోన రాజాన్వయముల
చెలులు తమయంతి పురికిని బిలువఁ బనిచి
నన్నుఁ గని చాలదినములనాఁడు గోలు
పోయి మఱిగన్న జనకుని బోల్కి ముద్దు
తనయునట్టులు కన్నీరు తనకుఁదాన
కాఱ సమ్మాన మొనరించు కరణి స్మృతికి
వచ్చినంతన బాష్పముల్ వచ్చునాదు
కనుల, కిదియేమి కత మొ నీవనఁగఁగలవె ?
క్రమగుణముల కుప్ప టెంకాయచిప్ప. 130.
గీ. తెలిసెఁ దెలిసె రహస్యంబు తెలియవినుము
శ్రీరఘూ త్తము బంటౌట కారణంబు
పవన పుత్రుని మైనాకపర్వతంబు
వీతిహోత్రుండు మును గారవింపలేదె ?
నన్నుఁగని కాద యిదియెల్ల, నా విభుండు
రాముఁగని కాని, యీసపర్యలును నాకుఁ
గావ యాయనకే కాని కాన నీవు
కలుగుసత్యం బెఱుంగు టెంకాయచిప్ప. 131.
గీ. ప్రభుని దోఁచెను భద్రాద్రిరామదాసుఁ ;
డవని జనములఁ దిరుమంగయాళువారు ;
దేహి భిక్షా మటంచును దిరిగి దేశ
మెల్లఁ గైంకర్యమొనరింతు ; నెల్లరకును
రాముకై ంకర్య సత్ఫలరాజి గలుగఁ
గనవె నాచి త్తవృత్తిఁ డెంకాయచిప్ప. 132.
కం. ఇప్పుగిది జనులనడుమను
ద్రిప్పెడు నందాఁక నొక్క తిరిపెపుగుడ్డఁ
గప్పఁగ నిమ్మీ నా కని
చెప్పుమ టెంకాయచిప్ప శ్రీరామునకుఁ. 133.
గీ. ఆదియు నేల యటంటివే నాలకింపు
వెఱ్ఱిజనములు నన్గని వెఱ్ఱియనిన
రాముకార్యం బదెంతయు రాటుపడదె
కల తెఱంగంటి నీకుఁ డెంకాయచిప్ప. 134.
గీ. వస్త్రమునఁ గల్గు నభిమాన వశతఁగాదు
పుట్టినప్పుడు ప్రాణముల్ పోయినపుడు
కూడరాదొక పుట్టంబు గోఁచియైన
నడిమిజంజాట మిదియేల ? గొడవలెన్ని
దానికై ? గర్వ మెంత యద్దానిఁ దాల్చి ?
దాని కూపచారమెంత ప్రత్యహము నుదుక ?
వ్యాధు లవియెన్ని యద్దానివలనఁగలుగు ?
తొలఁగిపోయిన నదియెంత దుఃఖ మెదకు ?
దాని ధరియింపఁడే నవమానమంట !
యంబరమె నాకు నగుఁగాక యంబరంబు
శృంగిమల నాకుఁ బాన్పయి చెలఁగుఁగాక
రామతీర్థంబె సుధయయి క్రాలుఁ గాక
కోసలేశుండె చేయూఁత కోల యగుత
క్ష్మాసు తేశునికరుణఁ డెంకాయచిప్ప. 135.
గీ. కాంతి సొబగారుచున్న యనంతపురిని
శారదా సమాజమునందు సభ్యురాలు
శారదనుబోలి ధవళవస్త్రంబుఁ గట్టి
మితసుభూషణ యు క్తయౌ నుతచరిత్ర
హితము బోధించె ; నద్దాని నెదను నిలిపి
నాఁడఁ ; బని పూనికార్యంబు కీడు పొరయ
కుండఁ గాచుటకై ; దాన నుత్పథమునఁ
గ్రాల మన సొప్పదయ్యెఁ డెంకాయచిప్ప. 136.
గీ. నిన్న నేకద వ్రాసితి నిన్ను యోగ
దండమును గోఁచినిం గూఁడ దలఁపు గలద
యేని రామునిఁ గొనుమని, యింతలోన
విఱిగె రెండుగ దండంబు వింతయేమొ.
వలదు తత్స్పృహ మిఁక నని పలుక నేమొ ?
యెట్టు లెఱుఁగఁగవచ్చు సీ తేశుమతిని
గ్రమగుణముల కుప్ప టెంకాయచిప్ప. 137.
గీ. నరసరెడ్డియు లేబాక కరణవరుఁడు
పొందలూర్ వీరరెడ్డియు ముఖ్యజనులు

కొర్లకుంటాంజనేయులు గుణయుతుండు
నవలఁ గురుగుంటుపల్లె కామాక్షియమ్మ
యవలఁ గోడూరు చెంచురామయ్య మిగుల
సాయపడినవారు శ్రీ రామచంద్రమునకు
వారి రక్షింపఁ జెప్పఁగ వలయు నీవు
కరుణ గలదానవప్పు టెంకాయచిప్ప. 138.

గీ. పది మణుంగులుగాఁ జింతపండుఁ బంప
బాస యొనరించెఁ గోడూరు వంశభవుండు
ప్రథిత వేంకట శివరాజు ; బాసె గాదు
మిరపకాయలు – కందులు మేలిపెసలుఁ
బంపుచున్నారు మూడేండ్లఁబట్టి మధుర
రంగయయును మహానంది రడ్డిముఖులు
నల్ల చాగంటిపాళెంబు నందువారు
సత్రమున వెచ్చమునకయి శ్రద్ధతోడ
వీరలకును దీర్ఘాయువు వెలయఁ జేయఁ
గరుణ వచియింపు మప్ప టెంకాయచిప్ప. 139.

గీ. ఇట్టి పుణ్యాత్ము లిలపయిఁ బుట్టిరేని
రాము కార్యంబు స్థిరమయి క్రాలుఁగాదె ?
దుర్వ్యయంబుల వేనవేల్ దోఁపు పెట్ట
మనస్సువచ్చిన విధమున మనసురాదు
ధర్మకార్యంబులను జేయఁ దలఁగు నేమొ
జన్మ జన్మార్జితము కలుషముల గొంత
యేని యనుభీతిలో భ క్తి ; నేడిపింపఁ
బిసినిగొట్టును నేమియు వేఁడఁబోను ;
దాత లగువార లిత్తురు తమకుఁ దార
కాదె నిక్క ము చెప్పుమ టెంకాయచిప్ప. 140.

గీ. శాశ్వతాన్న దానమునకు సాధుధర్మ
మతులు చాగంటిపాళెము సతులు నరులు
నాల్గునూ ర్లర్పణము చేసినారు నేఁడు
కరుణఁ దెల్పుము జానకీ కాముకునకుఁ
గరముఁ బ్రీతి యెలర్పఁ దెంకాయచిప్ప. 141.

గీ. రమ్య శ్రీరామజయ మందిరంబు పేరఁ
జెన్నపురిఁ దిరువళ్కే ణిఁ జెలఁగుతనదు
గృహము బాడుగులేకుండ నిచ్చినాఁడు ;
తలఁచె నేనియు నిప్పుడ దానముగను
భ క్తి నొసఁగంగఁగల యట్టి ప్రాజ్ఞతముఁడు
తూమూలూర్ శివరామయ్య ప్రేమమీఱ
మిగుల నాప్తుండు శిష్యుండు మేలిభక్తి
గలుగువాఁడని యెంతయుఁ బలుక వలయు
సిరియు సంపద ము క్తియుఁ జేకుఱంగఁ
జేయఁ జెప్పుము, శ్రీరఘుశేఖరునకుఁ
గలిత గుణముల కుప్ప టెంకాయచిప్ప 142.

కం. అఱగొఱగా నొసఁగిన యా
కొఱదాతల పేర్ల నేను గొందాఁడఁ జుమీ
మఱి యొకపరి యెఱిఁగించెద
నెఱి తప్పక మాటమీఁద నిల్చిరయేని౯. 143.

గీ. పేరు చెప్పఁగ దగువార లేరు లేరు
మదనపల్లిని మద్బాల్య మైత్రిఁదలఁచి
రెండువందల యేఁబది నిండుప్రీతి
గురుకులంబునకై యిచ్చెఁ ; గూర్మిభ్రాత
సుబ్బరాయాఖ్యు నుడివిని శుద్ధచరితుఁ
డన్న దానంబునకు గాఁగ నాఱెకరము
లల్ల బద్వేలు తాలూకునం దొసంగె
కొచ్చి సంస్థానమంత్రియై కొఱలినాఁడు
నెమలివంశభవుండు వినిర్మలమతి
యైన పట్టాభి రామరాయం డొకండె
రమణ ముడు బాగలాన్వయ రామరావు
తప్పఁ దప్పక చెపుమిది చిప్ప నీవు
శిష్టరక్షకుఁడౌ రఘు శేఖరునకు
నాయు రారోగ్యము క్తుల నర్థినొసఁగ. 144.

గీ. పైఁ డికడి యంబు నొసఁగె సద్భ క్తితోడ
ధర్మవరపు గోవిందమ్మ దానశీల ;
హెన్నుపూసలు, దండయు నొసఁగినారు
లింగమ, అ, కోటిరెడ్డి యభంగ భక్తి
వీరి కాయురారోగ్య మవ్వారిసుఖముఁ
గరుణ నొసఁగఁగఁ జెపుమ టెంకాయచిప్ప. 145.

గీ. అవని నేఁబాసి చనిన యనంతరంబు
రామచంద్రుని ధర్మకార్యములఁ జేయు
శ్రద్ధధానుల నాదు విశ్వాసివరుల
యోగమును క్షేమ మెవ్వేళ బాగుగాను
నరయు మంచును జెపుమ సీతాధిపతికిఁ
గ్రమగుణములదొప్ప టెంకాయచిప్ప. 146.

గీ. గొల్లకన్నెల మానంబుఁ గొల్లలాడి
తనకు వారికి నడుమ వస్త్రమును లేక

చేసి ము క్తికి యోగ్యులఁ జేసినాఁడు
ఆత్మచింతన స్థిరపడునట్లు చేసి
యట్టె చేయంగఁ దలఁచెనో ; యట్లుగాక
గాలిబువ్వగఁ, దనసేవ కార్యముగను,
జేయుచును భూమిరక్షయుఁ జేయుచున్న
శేషువలె నన్నుఁ దన శేషుఁ జేయునేమొ ;
కాయగసురులు భుజయించి కడుపు నించి
మనములోఁ దన్నె స్మరియించి తనదుసేవ
సర్వవేళలఁజేయు నంజనతనూజు
నట్లు చేయంగఁ దలఁచెనో ; యట్లుగాక
రెండుపక్షముల్ సమముగ నుండఁజేసి
నడుమఁ దన్ను భరించి యనారతంబు
జిహ్వగంబుల మదమును జీల్చివైన
నవనికై దిగునట్టి విహంగనాథు
నట్లుచేయంగఁ దలఁచెనో ; యడిగి చూడు
చిత్రసంకల్పుఁడౌ రఘు శేఖరునిని
గ్రమగుణములకుప్ప టెంకాయచిప్ప. 147.

గీ. ఏమి మానితివో యేమొ యేనెఱుంగ
స్వాదుఫలముల భుజియింప వదలినావె ?
పట్టు పుట్టంబు గోఁచిని బాసినావె ?
పీన్గువలెఁ బడి నిద్రింప విడిచినావె ?
విడిచినానను తలఁపును విడిచినావె ?
యనుచు నడి గెదవేని యీ యన్నిటికిని
గతము నీవడ్గు రాముఁ డెంకాయచిప్ప. 148.

గీ. ఎవరి సాహ్యంబు లేకున్న నింతదాఁక
బ్రదికి యుండనౌ క్షయరోగ బాధవలన
నట్టి కడప నన్నే మియ్య ననఘచరితు ;
వైద్యరత్న భిషఙ్మణి వరబిరుదము
లంది పండిత గోపాల కాఖ్యఁ జెన్న
పురిని దనరిన మన్మిత్రుఁ గరముసుఖులఁ
జేయుమని చెప్పు మా రఘు శేఖరునకుఁ
గ్రమగుణముల కుప్పె టెంకాయచిప్ప. 149.

గీ. ఎనితోడ్పాటు లేకున్న నవని తనయ
విభుని కార్యంబు గీడ్పడి విఘ్నపడునొ
యట్టి మిత్రుఁ ద్రిజన్మ శక్త్యౌషధాల
యాధిపుని మధుభాషిని నార్యచరితు
ధన్యు సౌజన్యనిధి హరిదాస చంద్ర
రాయుఁ బ్రోవుమటంచుఁ డేంకాయచిప్ప
చప్పుమీ దయ శ్రీ రఘు శేఖరునకు. 150.

గీ. చంటిబిడ్డగఁ, దముగన్న జనని గాఁగ,
శుకునిగాఁ; దోలుబొమ్మగాఁ, జూచి నన్ను
నెవరు చరియించి నాదు జితేంద్రియతను
విశ్వసించిరొ యావంత వెగటు లేక
యట్టి చెలువలల కెల్ల మాయమ్మ కెట్టి
పుణ్యలోకంబు లొసఁగె నాపుణ్యగతులె
యొసఁగుమీయని చెప్పుమా కొసరి కొసరి
యేకపత్నీవ్రతుండు సీ తేశునకును
గ్రమగుణముల తిప్ప టెంకాయచిప్ప. 151.

గీ. కామమే ఘోరవిషమయి కానిపించుఁ ;
గనులు ప్రథమాపరాధు లాకార్యమందుఁ ;
గామచేష్టలు వెలికిని గానకుండఁ
గట్టువారలు గోఁచులు బుట్టములను ;
కాముగర్వంబు మాయించి గట్టిమతిని
గామజయశీలుఁడై క్రాలు ఘనుని కాము
కంబ మదియొకతోలు గొట్టంబకాదె ?
వానియెదుట నదెట్లున్న వాసి చెడునె
బాలుఁ డేటికిఁ గట్టఁడు వస్త్రములను ?
వానిఁగని సిగ్గుపడునె యే వనితయైనఁ
గలది గలయట్టు చెప్పు టెంకాయచిప్ప. 152.

గీ. నన్నెఱుంగక యుండియు నాదుపేరఁ
బు స్తకాలయమును బ్రీతి పూర్వకముగ
నిలిపి నారలు వేంద్రను గలుగు జనులు
వారి యవ్యాజర క్తి కవ్యయసుఖంబుఁ
గలుగఁజేయఁగఁ జెపుమ టెంకాయచిప్ప. 153.

గీ. పూజ్యుఁడనుచును గొందఱు పూజసేయ
రాక్షసుండని కొందఱు త్రాసగరిమఁ
బరువులెత్తిరి దాఁగంగ వాములందు
మిట్టలందును మఱి బొల్లబుట్టలందు
వంటయిండ్లను బెరడుల ; వాకిళులను
భార్యలను నిల్చి లేఁడని పలుకఁజేసి
రయ్యొ కనుఁగొంటె లోభమహత్త్వమకట
యెట్టి దశకును దుచ్చె నీ కట్టిఁడులను
గట్టితినొ కొట్టితొనొ చెఱపట్టినానొ ?
వీరిఁగన్గొని నవ్వవే వేడ్క మిఱఁ

గ్రమగుణముల కుప్ప టెంకాయచిప్ప. 154.

గీ. రాగమేమియుఁ బోని బై రాగివాఁడు
అర్థకాంక్షను విడని సన్న్యాసివాఁడు
స్వామిసొత్తును దినుచు లక్షల కొలంది
ప్రాఁతగొడు గీయ నేడ్చె నేబ్రాసియొకఁడు
వానిగతి యటులుండ నన్యూనభక్తి
నూట పదునాఱొసంగె జంజాటముండి
నర్పణముచేసె ఛత్రద్వయంబు నూత్న
రచితముల నట్టి యం. పి. శర్మకు సుపుత్ర
సంపదలుగూర్ప నపవర్గ మొనరఁ
జేయఁ జెప్పుమ పతికిఁ డెంకాయచిప్ప. 155.

**శ్రీరామార్పణమస్తు.**

శ్రీ రామాయనమః

# టెంకాయచిప్ప శతకము

## ద్వితీయ భాగము

చం. మిడిమిడి యెండగాయ, నడిమింటను వేఁడి వెలుంగు నిల్వఁ
గా। గొడుగును బాదరక్షలునుగూడధరింపక పాదచారినై।
సుడియక వీథివెంటఁ జనఁ జూచుచు నశ్రులు రాల్చెఁ
గన్నులం। బడి నిటులైన నెట్లు రఘువర్యుని కార్యముఁ
దీర్తు నాయనా ? 156.

గీ. పాలొసంగినఁ ద్రావ వవేళ యనుచు,
దేహమునఁ బుష్టిలేకున్న దేవకార్య
మెట్లు నెఱవేఱు నంచేడ్చె నెంతొ ప్రేమ,
నకపనాయని తల్లికి, నట్టికమ్మ
పొలఁతికిని, దనతల్లి కేపుణ్యలోక
మిచ్చె నట్టిద లోకంబు నిమ్మటంచుఁ
గరుణఁ బలుకుము నీవు టెంకాయచిప్ప. 157.

గీ. రామసేవా కుటీర నిర్మాణమునకు
నిల నొసంగిరి యారణి కృష్ణరాయ
సుతులు శ్రీరామరాయాది సుకృతిపరులు
అతిథు లభ్యాగతులునైన యవనిసురుల
కును బ్రయోజనపడ ; నట్టి యనఘమతుల
కతులసౌఖ్య విభూతుల నందఁజేయఁ
గదిసి పలుకుము రాముఁ డెంకాయచిప్ప. 158.

గీ. సాటిలేనట్టి యా మద్దులేటిగడ్డ
రైతు లెంతయు సుకృతులు నీతిపరులు,
నన్నపానంబు లొసఁగి యభ్యాగతులకు
నర్చనము సేయువారలు నాస్థతోడ,
శూద్రులకు నెల్ల నీ మనశ్శుద్ధి యున్న
నిట్టి కడగండ్లు దేశాన కేల యొదవు ?
వీరికి శుభంబుఁ గూర్ప నెవ్వేళలందుఁ
గరుణఁ బలుకుము పతికిఁ డెంకాయచిప్ప. 159.

గీ. పాత్రములనీళ్ళు పదములఁ బాఱఁబోసి
బోకి బోర్లించి మేన్వంచి మ్రొక్కు వారు
బోకికో ? రామునకొ ? నీకొ ? నాకొ ? చెపుమ
క్రమగుణములతిప్ప టెంకాయచిప్ప. 160.

గీ. హితవుమీఱంగ నొక్కొక్క మతమువారు
వారివారి కభీష్టమౌ పద్ధతులను
నర్చనముచేయు సమయాన హోళిమీఱఁ
బసుపు గందంబుఁ బూసియుఁ బాదములకు
నిలువుబొట్టిడి దానిపై నీటుగాఁగ
నడ్డము విబూదిపెట్టి, యనంతరంబు
కుంకుమము బొట్టుపెట్టి, రీ కొమరుఁగాంచి
యెంత నవ్వితివో యేమొ యే నెఱుంగ
సొరిది మీఁగాళ్ళు మోఁకాళ్లు కరము వ్రేళ్ళు
చెలఁగి మణిబంధములును మోచేతు లవలఁ
గణఁతలును లలాటంబును గన్ను ఱెప్ప
లింక నెందెందొ బూదిని బొందుపఱిచి
ప త్తిరులు బూలు నుంచి ధూపంబు నిచ్చి
దృష్టిదగులక యుండఁగా నేమొ కప్పు
రంపుటారతి నొసఁగి, రా ఱంపు చూచి
యెంతనవ్వితివోగాక, యెదను బెదరి
దేనికిని గట్టు వెఱబొమ్మగాను దలఁచి
కలఁక చెందితొ చెపుమ టెంకాయచిప్ప. 161.

గీ. భక్తురాంద్రను బుణ్యలౌ పద్మముఖులఁ
బెక్కు రను గంటిఁగాని సంప్రీతితోడ
నల్ల రేలంగిలోన సీతాయి యమ్మ,
చెల్ల లప్పల రాజున, కల్లసతికి
సాటియవుదానిఁ గననైతి, సాక్షి నీవె,
క్రమగుణములతిప్ప టెంకాయచిప్ప. 162.

గీ. మమతదోఁపఁగ నెందఱో మానవతులు
భక్తు లిచ్చిరి మేలైన పాల ; నున్న
భంగి వచియింపవలయు ; రేలంగిలోన
భక్తులిడినట్టి పాలకుఁ బాటిరావు
కపిలగోక్షీరమౌట యే కారణంబు.
అన్న మేటికి ! నీళ్ళేల ? యల్లపాలు
సగము పావైనఁ బ్రాణరక్షణముచేయఁ
జాలవే పేర్లకొలఁదు లవేల ? చెపుమ
క్రమగుణములతిప్ప టెంకాయచిప్ప. 163.

గీ. రామచంద్రు శతాంగ నిర్మాణ మెవని
పేరఁజేసిన సాగు నిర్వఘ్నమగుచు
ననుచు నరివర్ణ చక్రంబునందుఁ జూడ
సూ సు లరినిలయంబులఁ జూడనయ్యె ;
నమృత బీజంబు నగుచు మిత్రాలయమున
నుండు వారం బి దేయాఖ్య నొప్పుమీఱె ;
హనుమంతు బ్రహ్మపుత్రు నట్లాకెపాటి
సూరరెడ్డికి హితుఁడయి చొప్పుఁ దెలుపు
నెవ్వఁడా వెంగి సెట్టికి హితమనీషి

కర్యకులరత్నమున, కనహమ్మతికిని,
మానులును నీచులును భ క్తిహీను లధము
నధికలుబ్ధులునై నట్టి యర్యవంశ
భవులు నేర్చుకొనంగ మేల్బంతియైన
యనఘ సద్వ ర్తంబున నమరువాని
కవ్యయానంద మొనగూర్పు మనుచుఁ బలుకు
క్ష్మాసుతాపతితోడఁ దెంకాయచిప్ప. 164.

గీ. పల్లెటూళ్ళుల జనములభ క్తిఁ గాంచి
మూఢభ క్తి యటందురు మూఢమతులు,
మూఢభ క్తియుఁ గాదది గాఢభ క్తి
చంచలత్వంబు గానని సాంద్రభ క్తి
ఒక్క టన మది నిల్చిన యుగ్రభ క్తి
వాదములకు వణంకని పరమభ క్తి
యెట్టి కల్మష మెఱుఁగని గట్టిభ క్తి.
యేకలవ్యుని భ క్తికి నేమిపేరు ?
నాగవల్ల భు భ క్తికి నామమేది ?
గ్రద్ద యుడుతల భ క్తికి ఖ్యాతియేది ?
నందనార్ తిన్ననుల భ క్తి చందమేది ?
మాలయోబనిభ క్తి సమాఖ్యయెద్ది ?
కొలఁదివారి నాక్షేపించు గుణమెకాక
జ్ఞాను లనుకొనువారలఁ గానరాదు
పండితులయందుఁ బెదసున్న పరమభ క్తి
నటన మొక్క టిగాక ; యోనారి కేళ
కర్పరమ ! నీవు దీనిని గంటికాదె ? 165.

గీ. ఇట్టి కార్యంబుఁ దాఁదలపెట్టి యే మొ
విఘ్నములు లేక కృతి నెఱవేఱుటకును
దాన తొలఁగించె బహుళబంధంబు లెల్ల ;
మొదటఁ దలఁగించె నిల్లాలి ; నదియు యున్నఁ
ధనమునంతయు దశరథాత్మజున కిచ్చి
దనదుభజనము విడిచి రామునిభజింప
రెండుకన్నులు దానికి మండిపోవె ?
యెరవుకూఁతును నల్లుని నెంతొయు క్తి
యేవొ నెపములఁ బాచెను నెడపడంగ ;
ఋణమువశమున నిల దాపరించినట్టి
భ్రాతృపుత్రుల నవినయపరుఁజేసి
పండుటాకులు పడిపోవు పగిదిగాఁగ
వారి యంతట వారలే పాయఁజేసె ;
సాయ మొనరింతు నంచును జాల్మఁ డొక్క ఁ
డేమొ యెట్టిదొ బుద్ధియై నేగుదెంచి
యుప్పునీటను వసియించు నుప్పుచేఁప
మంచి జలములఁ బడినట్టి మాడ్కి నయ్యె ;
నెవరినేనియు నేనయి యేగుమన్న
యట్టిదియు లేదు, రాముఁడే యంతచేసెఁ
బొత్తు కుదురనివారలఁ బోవఁజేసి
కార్యకరణ నైపుణ్యంబుఁ గలుగువారి
నాస్థయును శ్రద్ధ భ క్తియు నమరువారి
సుబ్బరావును సీతమ్మ సూరరెడ్డి
రామచంద్రాఖ్యు నిలిపెఁ గార్యములఁదీర్ప.
యుండఁ గూడును గుడ్డయు యుగ్మబాధ
కాళ్ళనొప్పులు దప్పియుఁ గీళ్ళనొప్పు
లేవి లేకుండ శిక్షించె నెంతొమున్న
పట్టనంబులఁ బల్లెల బాధ దోఁప
కుండ సాధ్వుల సాధుల నిండుప్రీతి
మేనిఁబ్రోవంగఁజెసె సమ్మానరీతి ;
గ్రంథముల వెలయించి జగంబునందు
యశము వ్యాపింపఁజేసె సీతాధినేత ;
తనదుకార్యంబు సాగించుకొనఁగఁగోరి
యెంతనాటకమును దీర్చె నెఱిఁగితేమె
కలికిగుణముల తిప్ప టెంకాయచిప్ప. 166.

గీ. తాను బ్రతుకఁగ లేకయా దాశరథియు
నిట్టి నాటకమును బన్ను టెల్ల ననెదె ?
కాదు, నిన్నును నన్నును క్ష్మా జనముల
దాతలను భ క్తులను బ్రోవఁదలఁపుఁజేసి
కాని యిది నిక్కు వంబు టెంకాయచిప్ప. 167.

గీ. కఠినచిత్తుల వైశ్యులఁ గఱకులాడి
నాఁడనని యెంచకుమ యంటి న్యాయసరణి
నిప్పటికిని దోఁచినట్టి తద్వృ త్త మరసి ;
యంతమాత్రాన వారలయందు మంచి
గుణము లేదని తలఁపకు కుటిలబుద్ధి
వారినే పీఁకి తిం ద్రధికారులెల్ల
స్వప్రతిష్ఠకుఁ గార్యముల్ సలుపునపుడు,
బిచ్చగాఁడెట్టిఁడును వారిఁ బీడచేయు,
వారు చెనకరు పరుల నేకారణమున,
బాధ లిడినను సైరించి పడుచునుంద్రు
మీఁదిజాతులవారల మేల్బ్రతుకు
చూచి రవయంతయైన నసూయపడరు,
వారియెడ భ క్తిశ్రద్ధయుఁ బాయఁబోరు,
ధానధర్మంబు లెన్నొ యుదారమతిని
సలిపినారలు ; వీనిని దెలియ కేను
జెప్పితినటంచుఁ దలఁపకు చి త్తమునను ;
నీచతను వీరమించిన నీచు లేఁడు
పలుకు సాక్ష్యంబు బద్వేలు స్పష్టఫణితి ;
దేశమంతయు నట్లని తలఁపవలదు ;
పాఁపగ్రుడ్డులు చెదరిన పగిదిఁ గలరు
ప త్తి గురుమూ ర్తివంటి యత్యు త్తములును ;
ఉన్న దున్నట్టు చెప్పుట యొప్పుఁగాక
తప్పుచేసిన జనముల తథ్య మనరె ;
నిక్క పుం భ క్తి శ్రద్ధయు నెఱిఁగఁగల్గు

వైశ్యతరుణీసురత్నముల్ బహుళముగను
నున్నవారలు ; తద్భ క్తి యూర్జితంబు
చేయుటొప్పును ; గపటులు మాయచేసి
వారలను మోసగింత్రు దుర్భావమునను
గ్రమగుణముల కుప్ప టెంకాయచిప్ప. 168.
గీ. కలికియొక్క తె యల యుర్ల గట్టుపోడు
నందు మగనికిఁ బెట్టెడు మందు గలదె ?
యంచు నడిగెను ; బీడీల నడిగినారు,
పత్రి యాచించినారు ; సభాజనాళి
వాక్కు కట్టెడు మంత్రముల్ వలచినారు,
క్షుత్తుగాకుండ మంత్రముల్ గోరినారు
స్త్రీలఁ దమకును వశపడఁ జేసికొనెడి
మంత్రముల వేఁడినారు దు స్తంత్రపరులు,
తామ్ర భస్మంబు చేయఁ బ్రార్థనముచేసి
నారు ; వీరలలోన నుదారులైన
వారు బీడీల నాకీయ వచ్చినారు,
దానిలోన విశేష మర్థంబుఁ ద్రావి
నా కొసంగిరి కొందఱు ; న్యాయ్య సరణి
యదియ యౌనఁట సాధులయందుఁ ; గంటె
యిట్టివారలు మఱి కావి బొట్టు పెట్టి
నారు, నిలువంగులను దొడ్గినారు, యోగ
దండము నొకండు కరమునఁ దాల్చినారు
కాళిదుర్గను నడిపింపఁ గలిగినారు
మణువురుద్రాక్ష లొడలను మాటినారు
ప స్తటంచును బుట్టెఁడు వడల దొంగ
తనముగా మెక్కి పందులై తనరినారు
కాఁపుపొలఁతుల పురుషుల కన్నులందు
మిరపపొడిచల్లి వారి నమ్మించినారు
పిల్లవెంద్రుక నొక్క టి పీఁకి రాగి
తాయెతులనుంచి రక్షగా ధారణంబు
సేయ నొసఁగుచు నున్నారు స్త్రీల కయ్యొ
మతులు పుట్టఁగ, నుపపతి రతులు గలుగ,
వ్యాధులు హరింప; దయ్యాలు పాఱిపోవ ;
సాధువేషాల నెంతమోసంబు జరుగు
చున్నదో కంటివేమె యీ యుర్వియందుఁ
గలికి గుణముల తిప్ప టెంకాయచిప్ప. 169.
గీ. వేదాంతుల మోసంబును
గాదు వచింపఁగను బెద్ద గాథ యదౌటన్
మీఁద నొక నాటకంబుగఁ
బ్రాదుర్భావింపఁజేయ భావంబుంటన్ 170.
గీ. నీచజాతుల వారల నిందసేయ
నగునె, కుటిలులు వంచకు లనుచు వారు ?
పెద్దవారని జనములఁ బేరుగన్న
వారియం దెట్టి ద్రోహు లున్నారొ కనవె ?
క్రమగుణముల కుప్ప టెంకాయచిప్ప. 171.
గీ. పరుల మేలును సఁపని పాపజాతి
ఈసుమచ్చరముల పుట్టినింటి తావు
కనులు మూయుచుఁ దెఱచెడి కాలనేమి
కుడిచి నిలువాసముల నెంచు కూళవాఁడు
వంచనంబున శంబరు మించువాఁడు
అన్నదానంబునకు విఘ్న మాచరించు
పంద ; కోదండరాముని భద్రరథము
తిరుగ నొల్లని యట్టి మందేఖలుఁడు
పొట్టచీల్చినఁ బౌజును బట్టి వెదక
ఋజుత యెందేని లేనట్టి హీనబుద్ధి ;
బహుజన విరోధి ; మలమునఁ బడినరువ్వ
యైన నాల్క ను గొను లోభి, యన్యవి త్త
దాసశూరుండు, కొనిన యద్దాని మరల
నీయవలసిన వెకి వెక్కి యేడ్చువాఁడు
బకమువలె ధ్యాన మొనరించు వంచకుండుఁ
బరుల సాహ్యంబునకు నడ్డపడెడు శఠుఁడు
నీ వెఱుంగవె పేరేల నేను జెప్పఁ ?
గ్రమగుణముల తిప్ప టెంకాయచిప్ప. 172.
గీ. శ క్తిగలియుఁ గొందఱు శఠులు తమకు
శ క్తి లే దంద్రుగద దాన సమయమందు ;
దాపరించెడి నిర్భాగ్య దశను మున్నె
చెప్పుచున్నదొ యినుప గజ్జియల తల్లి
కాఁపురంబుండి వారి నాల్క ను సతంబు.
శేషమాంబాపురంబున చేరువందు
భారవాహకవృ త్తిని బ్రతుకువాఁడు
కట్టియల మోపు నొకటి విక్రయము చేసి
దాన వచ్చిన రెండణాల్ దానమిచ్చె
జానకీనాయకునకు నీలోన వైచి
పస్తుపడి యుండె నారాత్రి భ క్తిపేర్మి.
బద్దెవేల్ నొద్ద వల్లురి వారిపల్లె
గనుసుగడ్డల నుడికించి జనులకమ్మి
జీవనముచేయు కుమ్మరి చెలువ యిచ్చె
నొక్క రూప్యంబు ; నంతియ యువిదయొకతె
క్రొ త్తపల్లియ బ్రతుకుచుఁ గూలిచేత
నిచ్చె ; నున్నారు బహుజను లిట్టివారు
వీరలెల్ల దరిద్రులే, వేఱు తెగల
వారుగారని నీకును వచ్చుఁ దెలియ ;
నెంతయేనియు నార్జించి యింట దాఁచి
యిచ్చుటకు నేడ్చు లోభియే ముచ్చటించు
శ క్తిలే దని ; నిజముగ శ క్తిలేని
వారు లజ్జ వహింతు రప్పగిదిఁ బలుక,
ఇట్టికల్ల ల వేల? నే నీయ ననినఁ
గొట్టువారలె యెవరేని ? రట్టులేల ?

క్రమగుణపాళి తిప్ప టెంకాయచిప్ప. 173.

గీ. భూమిసుతపతి కై ంకర్యమునకు సాయ
పడెద మని చెప్పి వ్రాసియు బాసచేసి
తప్పిపోయిరి కొంద ఱద్దాని కేను
వగవ, మఱుజన్మమునసైన వడ్డితోడ
వారలే తెచ్చియిత్తురు వాసి చెలఁగ ;
స్వామి ద్రవ్యంబు గొనియును బకమురీతిఁ
బాలు ద్రావిన దొంగమార్జాల మట్లు
కనులు మూయుచు విచ్చుచు ధనమునడుగ
ఱేఁచువలెఁ గర్వ వచ్చెడి నీచుఁ డేమి
గతికిఁ బోవునొ యడుగు టెంకాయచిప్ప
స్వక్రియా ధురంధరు రఘుస త్తమునిని. 174.

గీ. రామనాయఁడు నాఁగనుద్రాబయొకఁడు,
స్వామి పేర్వెట్టి జనులవంచనము చేసి
జయయుతుఁడు గామిఁ బడెఁ జెఱసాలయందు,
జయయుతుండైనఁ దిరుగఁడా భయము లేక
జనులలోఁ బెద్దమానిసి సరణిదోఁపఁ
గలికి గుణములకుప్ప టెంకాయచిప్ప. 175.

గీ. తాను జేసిన బాసను మానుఁ గాక
తాను దోడ్పడఁ గుండినఁ దలఁగుఁగాక
సాయ మొనరింపకుండఁ బరాయివారి
బోధచేసెడి వాఁడును బుడమి గలఁడె
స్వామి కార్యంబులం దెట్టి జాల్ముఁడైనఁ ?
గ్రమగుణముల తిప్ప టెంకాయచిప్ప. 176.

గీ. పెండ్లి కిని బోవు వేళను బిల్లిఁ జంకఁ
బెట్టుకొని పోవు వెంగలి విధమ యయ్యె
మేఁక మెడక్రింది చన్నుల జోక నొక్క ఁ
దూఁగులాడుచు మనవెంట నేగు దేర ;
వ్యర్థమేకాదు, కార్యంబు హానియయ్యె
బహుజన ద్వేషి యతఁ డౌటవలన, నిదియుఁ
గంటివేకద నీవు టెంకాయచిప్ప. 177.

గీ. పెద్దతిప్ప సముద్రానఁ బేరుగన్న
వారు సద్ధర్మరతులు సుదారమతులు
ప్రథిత సుగుణులు, కరిచెర్ల వంశవార్ధి
చంద్రుఁడైన నంజుండప్ప సాధుశీలి
సుబ్బయార్యుండు, టేకూరు శుద్ధకులజుఁ
డైన యా లక్ష్మిపతిశాస్త్రి యాస్థమీఱ
స్వామి బ్రహ్మోత్సవమునకు సరగవచ్చి
పూఁటకును నూర్లకొలఁది సాపాటుచేయ
రాఁగఁ బాకంబు దీర్చిరి రాగి దమ్మి
డైనఁ గైకోక, యేఁటేఁట నట్ల వచ్చి
చేయువార మటంచని చేసి బాసఁ
జనిరి ; వీరికిఁ బ్రతికృతి సలుపఁ దరమె
నాకు? నిది చెప్పుమీ రఘునాయకునకు
నాయురారోగ్య సంపదల్ హాయిఁ గూర్చ
వీరలకు నెల్ల వేళల విదితరీతిఁ
గ్రమగుణముల కుప్ప టెంకాయచిప్ప. 178.

గీ. కదనముల గొల్లియైనట్టి మదనపల్లి
వదలి రిక్తకరంబుల వచ్చి యూరు
కనఁగ నాచేత లేదొక కాసునైన
గోతమైనను బియ్యంబు గూడఁబడదు ;
నూతన రథంబుఁ జూచెడి కౌతుకమున
వేన వేలుగఁ బ్రజ వెల్లివిరియఁ జొచ్చె
నేమిరా సేయువాఁడనో రామదేవ !
యంకితమున యాదాళ్ళ నాగమ్మ పోల్కి
నెవ్వరైనను బుణ్యాత్ము లిత్తు రొక్కొ
యిదరొ గతియేమి యంచును జడియఁ, గాటు
వైచినను లేదు రక్తంబు వదనమందు ;
మాన మెడలినఁ బ్రాణంబుఁ బూననేల
యనుచు నిశ్చాయకుండ నై యడలుచుండ
ధర్మవరము గోవిందమ్మ దానశీల
తంతువాయుల తోడ్పాటు దనరఁ బంపె
రెండు గోతాల బియ్యంబు ప్రీతితోడ ;
నేడు గోతాల బియ్యంబు బేడ లొక్క
రెండు గోతాలు పంపి రఖండయశులు
తాటిప ర్తి నివాసులు దానరతులు
నందుఁ బామిడి సుబ్బయ్య యనఘుశీలి
యొకఁడె రెండుగోతా లిచ్చెఁ బ్రకటరీతి
శంకరశ్రేష్ఠి, మునసపు వేంకటాఖ్య
రెడ్డి, పెదచింతలప్ప, యరీణగుణులు
శ్రీనివాస, విజయరాఘు, వాను కలితు
లైన యాచార్యవర్యులు నసఘమతులు
మంతు కెక్కి న వీ హనుమంతరావు
తోడుపడినార లీ కృతి గాడుపడక
యుండఁ జేయఁగఁ ; బాటూర నుండువారు
ప్రథిత కసిరెడ్డి వంశసంభవుఁడు ప్రజల
స్తుతికిఁ బాత్రుండు వేంకట సుబ్బరెడ్డి
యొక్క గోతంబు బియ్యంబు నొసఁగె మఱియు
వేంకటప్పయ్య తోడ్పడ వేఱొకొండు
గోతమును సేకరించెను గొఱంతలేక
తాటిప ర్తి పురావాస ధన్యజనులు
రూప్య శతకంబుఁ బంపి రారూఢ యశులు.
అల్ల చాగంటి పాళెంపు నందువార
లాఱునూర్లను నర్పించి రమలమతిని
రామచంద్రుఁ డీరీతిని బ్రాణమాన
రక్ష సలిపెను దనదు కార్యంబు కొఱకు.
భ క్తి చాలమి కేనెంతొ వగతుఁగాని
యేమిటికి మోసగించు నీ తేశుఁ డెపుడు ?

ఇంతకం టెను దృష్టాంత మేలవలయు
దశరథాత్మజు కరుణా ప్రదర్శనమునఁ ?
గ్రమ గుణముల కుప్ప టెంకాయచిప్ప. 179.

గీ. ధర్మవరమున సుజనులౌ తంతువాయ
జనులు శ్రీరామసేవను సలిపినారు,
భజన మొనరించి యూరెల్ల భక్తిఁ దిరిగి
వట్టుగోఁచులు వస్త్రముల్ భక్తితోడ.
నర్పణము చేసినారు, బియ్యంబుఁ బంపి
నారు బ్రహ్మోత్సవము వేళ సారగురుత,
జ్యోతి వేంకట రమణప్పయును మనీషి
శంకరప్పయుఁ, దిమ్మప్ప, వేంకట రమ
ణప్ప యంబటి వంశజుల్, నగరసత్త్వ
సాధనంబు* నారాయణపాని పైఁడి
యుగరంబు లొసంగిరి యుల్ల మరలఁ
గంటివేకద నీవు టెంకాయచిప్ప. 180.

*నగరసత్త్వ సాధనంబు = వేశ్య

గీ. వంటకార్యంబు కీడ్పడె వారిలేమి
నని దిగుల్పడ వెఱఁదీర్చి యపుడ వచ్చి
వేంకటప్పయ్యగారును యా ప్త సహితు
లగుచు దోఁజెందు సుబ్బయ్య యరుగు దేర
వారి సమకూర్చి రపుడ యవ్వారిగాఁగ
రామసేవయె మిగుల గౌరవమటంచుఁ
బూజ్య గంగాధరత్వంబుఁ బోలఁగనిరి
వారలకును మహైశ్వర్య ప్రాప్తిఁ దనరఁ
గరుణఁ జేయుమటంచును గడఁగిపలుకు
జానకీనాథుతోడ సమ్మానఫణితిఁ
గ్రమ గుణముల తిప్ప టెంకాయచిప్ప. 181.

గీ. అన్నదానంబు సేయు కార్యంబునందు
నడుముఁగట్టి నిలంబడి బడలికనక
వంటవారల కన్నియు వైనముగను
నందియిచ్చుచుఁ జేయిం చె ననుపమముగ
శ్రమములకు నోర్చి యా కొమ్మరాజు రామ
రావు, నా చెల్లియలు మంత్రిప్రగడ* వేంక
ట నరసింహాఖ్యు భార్యయౌ ననఘశీల
పేర నమ్మణ్ణి శ్రీరఘువీరుతోడఁ
జెప్పుమీ నీవు వీరికి శ్రేయ మిడఁగఁ
గ్రమ గుణముల కుప్ప టెంకాయచిప్ప. 182.

*ప్రగడ = ఇదియపశబ్దము. ప్రెగడసాధురూపము. వారట్లువ్రాసికొనుటను నామములు లక్షణాతీతములని యీ రూపమే గ్రహింపఁబడెను.

గీ. అన్ని జాతులవారికి నన్నదాన
మొనరఁ జేయింపఁ బాకంబు దనరఁజేయ
శుంఠ యొకనాయి మిగుల నసూయఁజేసి
వంటముల్ చొర సర్వంబు వ్యర్థపడఁగఁ
దురక క్రైస్తవులను బంపె దొమ్మిసేయ
మఱియు నెన్నొ కుచేష్టలు మానకున్న
నట్టివార్తను వినుచు నుదారమతిని
సిద్ధవట తహశీల్దార్ శీలి సుగుణ
పరుఁడు కమలాపుర శ్రీనివాసరావు
సమయమున కాదుకొనుచును జక్కఁగాచెఁ
గరముఁ దోడయ్యె రామకై ఒకర్యమునను
వారి కతుల శుభంబులు ప్రాప్తిలంగఁ
గరుణఁ బలుకుము పతికిఁ డెంకాయచిప్ప. 183.

గీ. కేవలపరోపకారులై కీర్తిగన్న
భూరిచరితులయందు హెూతూరువంశ
భవుని వేంకోబరాయనిఁ బలుకవలయు
స్వార్థపరతయు గర్వంబు స్వాభిమాన
మెదలి యెంతటికొంచెమే నెంతగొప్ప
కార్యమేనియుఁ దనసొంత కార్యముగను
జక్క నెఱవేర్చి పరులకు సాయపడును
సామికార్యంబునం దెంతొ సాహ్యపడియె
అన్నదానంబునం దెంతొ యాదుకొనియె ;
అంతవానిని బెనుగొండయందుఁ గంటి
ననఘు రామచంద్రాచార్యు నమలచరితు
నాత్మసౌఖ్యంబు ప్రాణమేౖ బాయువాని
వీరి నిరతంబుఁ బ్రోవంగ విన్నవింపు
క్ష్మాసుతానాయకునకుఁ డెంకాయచిప్ప. 184.

గీ. ఎపుడుపోయినఁ గోడూరి కెదురువచ్చి
శిష్యసహితుండునగుదు విశిష్టమతిని
గెరలువేదము వేంకటకృష్ణశర్మ
కరుణఁ గావంగఁబలుకు టెంకాయచిప్ప. 185.

గీ. వైష్ణవుఁ డొకండు దేశికవర్యుమతము
వాఁడు నేనేగ భిక్షకై ప్రశ్నచేసె
కోవెలలఁగాక వేఱొక్క తావులందు
గలుగఁడో దేవుఁ ? డిట్లేల గాసిపడఁగ ?
ననుచు నొక్క పురంబున ; నట్లెచెప్పె
నొక్క శూద్రుఁడు తీర్థంబుఁ జక్కఁబఱుపు
మన్నసత్రంబు నిలుపుమ యంతెకాని
బాగుపఱుపకు కో వెల వర్ధమగుట
ననుచు వేఱొక్క నగరంబునందు నాకుఁ;
గటకటాయంధ మాతకుఁ గడుపుచెడఁగ
నిట్టివారలు దేశానఁ బుట్టియుండఁ
బ్రాజ్ఞమానులు నగుచును బ్రబలియుండఁ
దోరపుం భక్తిశ్రద్ధలఁ దోడుపడిన
సుకృతి చరితుల చరితంబు సూనృతముగ
జగతినిలువంగఁ జేయుట శ్లాఘ్యమె కద?
అట్లు కామిఁ గృతఘ్ను తాహతుఁడఁగానె
పరులకిది మార్గదర్శియై పరఁగుఁగాదె ?

భ క్తిపద్ధతు లెంతయుఁ బ్రబలుఁగాదె,
దీన శ్రేయంబుఁ గాంచదే దేశమెల్లఁ
గలితగుణపాళితిప్ప టెంకాయచిప్ప. 186.

గీ. ధర్మక ర్తలపేరు సార్థకముగాఁగ
దేవళంబుల యభివృద్ధికై విశేష
కష్టపడియెడు పుణ్యుల శిష్టనుతుల
నా మహానంది యయ్యను, సోమశిలను
బ్రథిత పెంచల సుబ్బయ్యఁ బ్రథమగుణ్య
లను గనుంగొంటి వీరల ఘనతఁగూర్చి
జానకీనాథుతోడ సమ్మానభ క్తి
కలనఁ గూర్చి వచింపు టెంకాయచిప్ప. 187.

గీ. పేరుపడసిన రాజమ పేఁటయందు
దైవకార్యంబునకు వంకదారురంగ
యార్యుఁ డంబటి రామయ యర్యవరుఁడు
సాయమొనరించుటలు రామచంద్రుతోడ
మనవియొనరింపు మిక్కి లి మక్కు వమరఁ
గలికిగుణముల కుప్ప టెంకాయచిప్ప. 188.

గీ. బ్రాహ్మణస్త్రీలు సంతాన వాంఛదవిలి
మంత్ర ముపదేశములఁ గొనమదినిబూని
దూదియేకుల కమసాల తురకవాండ్ర
పాదతీర్థంబు గొనుచును మోదమునను,
గప్పురపు టారతుల నిడి, గడ్డములకు
గంధమునుబూసి, వారల కరుణవడసి
"నేను గృష్ణుండ రాధవు నీవ యిదియె
తమిని వారు క్రీడించు బృందావనంబు"
ఇట్టి మంత్రంబు గైకొని యట్టెనడచి
యర్థమానముల్ గురునకు నప్పగించి
గుట్టుగా వెలివత్తురు కొట్టువిడిచి
కొట్టువెలివారు నవ్వంగ గొల్లుమనుచుఁ
జీరసవరించు కొనుచును సిగ్గుమాలి
వీర లీపాటు పడుచుండ వింతయేమొ
వైశ్యతరుణులు నిర్వాణవాంఛవచ్చి
యేది కడ తేఱుమార్గ మబ్జేక్షణలకు
నానతిండని భ క్తిమై నడుగువారు ;
కాలమహిమంబు నెవ్వఁడు గాననేర్పుఁ
గలికిగుణములకుప్ప టెంకాయచిప్ప. 189.

గీ. పాముపట్టిన కృష్ణు నేపాటి కాచి
రల్ల నందయశోదలు నైనవారు ;
జానకీనాథునంతటి సచ్చరిత్రుఁ
గానలను బడఁద్రోచిన కఠినులెవ్వరు ?
కటకటాకందుఁ గడుపారఁ గన్నకొడుకు
నల్ల ప్రహ్లాదు హింసించినది యెవండు ?
నిర్మలాత్మిక దమయంతి నిద్రవోవఁ
బ్రాణమునకన్న మిన్న యౌమాన మెడలఁ
గట్టుచీరను జించియుఁ గానలోన
నడవిమృగముల కెరగాఁగ విడిచిచనిన
ప్రాణఘాతుక శత్రువెవ్వాఁడొ ధరణి ?
తాను జేసిన ఋణముకై దయనువిడచి
చంద్రమతి దాసిగానమ్మ చతురుఁడెవఁడు?
యజ్ఞపశువుగఁ దనపుత్రు నమ్మిరెవరు?
కన్నవారలు భ ర్తలు గారె వీరు ?
ద్రౌపదికి మానభంగంబు దాపరింపఁ
గాంతులొక యేవురుండియుఁ గాచినారె?
వీరు సోపాకాధిప్తులు వీరు చాల
రక్క ఱల నవసరముల నాదుకొనఁగ ;
దెలిసియుండియు నీభంగి తెలివిలేక
బంధువులు తమ్ము బిడ్డలు భ్రాత లయ్యె
వార్ధకంబున నగుదురు ప్రాపటంచుఁ
జేరఁదీసితి నాబుద్ధి చేదుమేయ ;
నాదు మతిహీనతను గాంచి సాదరముగ
వారి నెల్లరఁ దొలఁగించి దూరగులుగఁ
దనదు సన్నిధి ననుఁజేర్చె దాశరథుఁడు
ఇట్లు గాకున్న నాగతియేమొ యెఱుఁగ
నెంత కరుణాళుఁ డవనిజా హృదయవిభుఁడు ;
భారమంతయు రాముపైఁ బాఱవైచి
నిర్భయతమించి తిరిగెద నేఁడుకంటె ;
ధరణిజాపతి సేవకై తిరుగుచొంటి
గుట్టలనొ మిట్టలనొ పెనుగొండలందొ
యెందు నీ దేహమూడిన నేమిభయము ?
రాఁడె గరుడధ్వజుఁడు కొనిపోఁడె నన్నుఁ ?
గృధ్రవరదుఁడు నేఁడెందు నేగినాఁడు ?
గలికి గుణముల కుప్ప టెంకాయచిప్ప. 190.

గీ. జపము లేనొల్ల గాటంపుఁ దపములొల్ల
బహుళకర్మంబులను నొల్ల బాధపఱుప
జానకీరాములను గందు సర్వమందు
జానకీరామ యనుచుందు సర్వవేళ
నెల్ల వాని కంజలి ఘటియించుచుందు
నాఱు నాలుగు నెనిమిది యక్క రములు
వాతికసిమితి దీరంగ వదురుచుండ ;
మాతృగర్భంబునందున్న మాడ్కి గాఁగ
వాసుదేవునియం దున్న వాఁడ నగుట
భయము శోకంబు మోహంబు పడఁగ నేల?
తల్లి చనుఁబాలు గ్రోలెడి పిల్లగాఁగ
యున్నవాఁడను జానకి యురమునందు
యామె స్తన్యంబె యమృతమై యోమనన్ను
నాఁకలని దప్పియని యేల యటమటింప ?
అర్క సోము లిర్వురు నొక్క యంబరమునఁ
దిరుగ నా కేల పెనుమోపు ఖరముభంగి ?

నింపు గూర్పంగఁజాలదే చింపిగోఁచి ?
కలిత గుణముల కుప్ప టెంకాయచిప్ప. 191.
గీ. భక్తి యోగంబె యోగంబు ప్రాణమగుటఁ
దక్కు యోగంబులకు నెల్లఁ దథ్యముగను
సుకరమయ్యది సాధింప శుద్ధమతిని
నాప్తుఁడును నిష్టుఁడైన సహాయుతోడ
నందనంబునఁ దిరిగెడి చందమద్ది ;
దండకాటవిఁ బోలును దక్కి నవియుఁ
గరము సాపాయమును దుఃఖకరము లగుట.
అన్నిజాతులవారును నాఁడువారు
బాగుపడుదురు సుఖముగ భక్తిగరిమ ;
భక్తికిని శక్తిచాలని వారలకును
ఝటితి ముక్తిప్రదంబు న్యాసంబు చువ్వె
కలికి గుణముల కుప్ప టెంకాయచిప్ప. 192.
గీ. ధర్మమెఱుఁగుదు నలుపఁగఁ దరముగా ద
ధర్మమెఱుఁగుదుఁ జాలింపఁ దరముగాదు ;
శుభములని యొనరింతు నశుభకృతులను,
అశుభమని శుభకృతిని జేయంగనొల్ల,
నెలమీహృదయస్థుఁడౌ హృషీ కేశుఁ డెట్టు
లాటలాడించు నట్టులె యాడుచుందు
దేనశుభమగు నశుభంబు దేననగునొ
యజ్ఞుఁడను గానఁగోరంగనైనఁ దెలియ ;
నవనిజాపతి సర్వజ్ఞుఁ డగుటఁజేసి
పరమకారుణికుం డయి పరఁగుఁగానఁ
గన్నతండ్రియు నగుట జగంబునకును
నాదుశుభ మేదియో యది యాదనెఱుఁగు
దానినె ఘటించు ; నిద్దానిఁ దలఁపలేక
జాలి ఘటియించె ఘటియించె మేలటంచు
మూఢమతినయి తలఁచితి మోహమునను
నన్ను క్షమియింపఁజెప్పు మా నాథునకును
గ్రమగుణములకుప్ప టెంకాయచిప్ప. 193.
గీ. పల్లెలందుఁ బ్రవేశింపఁ బ్రథమమునను
స్వాగతం బిచ్చుచుండు భౌ భౌ యటంచు
భైరవాశ్వంబు లిదె రాముబంటు వచ్చె
లెండు లెం డెదర్కొ నఁగ రా రండటంచు
గ్రామజనులను బిలిచెడి కరణియేమొ ;
యట్లు గాకున్న లోభులు యాచకులను
గసరువిధ మిదియని యనుకరణ మొక్కొ
కలికి గుణముల కుప్ప టెంకాయచిప్ప. 194.
గీ. దానధర్మంబులకుఁ దాము ద్రవ్య మొసఁగ
బాసచేసియుఁ దప్పినవారలకును
నిశ్చితార్థంబుచేసి కన్నియను వరుస
కీక తా ముపభోగించు హీనులకును
దారతమ్యంబు గలదేని పేరుకొనుమ
కలికి గుణముల కుప్ప టెంకాయచిప్ప. 195.
గీ. నేల జీరాడుపైఁటలు, కేళిగోళ్ళ
నంటురైకలు, వీనుల నంటు పాప
టలును, లోగుట్టు వెలిపెట్టు జిలుగువలువ,
లద్దిచాఁదునుఁ బల్లతో దిద్ది నుదుటి
బొట్టు చనుదెంచి మ్రొక్కి న పువ్వుఁబోండ్ల
వారవనిత లటంచును భ్రమసినాఁడ,
వీరలందఱు బ్రాహ్మణనారులంట !
ఇట్టివారలు గలుగంగ నేమివింత
మహినివేశ్యల కూటిని మట్టిపడిన
గలికి గుణముల కుప్ప టెంకాయచిప్ప. 196.
గీ. తిరుపతిపురంబునం దేను దిరుగువేళ
బాసటయ్యెను మిగుల విశ్వాసమునను
గోటగిరి రంగయాఖ్యుండు గుణవిదూషి
వీరి ప్రియపత్నియును జాలఁ బ్రీతిగలది
యట్టివారలె వీరల యనుఁగుఁదోడు
లెల్ల వీరికి నిత్యసంప్రాప్తిఁ గూర్ప
క్ష్మాసుతేశున కనుము టెంకాయచిప్ప. 197.
గీ. స్త్రీల దర్శించినంతన చిత్రమేమొ
యెన్నఁడో చన్న నాతల్లి స్మృతికివచ్చు
నిట్టి మోవియ కద నాకు నిడియె ముద్దు,
లిట్టి చేతులె కద నన్ను నె త్తిపెంచె,
నిట్టి కేల్ గాదె నన్ను జోకొట్టుచుండెఁ
గూర్మిమీఱంగ నిడుకొని కుఱువులందు,
నీకరంబులె నన్ను నుయ్యెలలనూఁచె,
నిట్టి తొమ్ములె కదనాకు నిచ్చెపాలు,
నిట్టి గర్భంబునంగాదె యేను నుంటి
మాసములు తొమ్మిదిని సుఖావాసముగను,
జననికే నెట్టి సేవయు సలుపలేదు
వీరి సేవలఁ జనదె నా వృజిన మనుచుఁ
గరముఁ దలపోయుచుందుఁ దెంకాయచిప్ప. 198.
గీ. ఇట్టి చెలువలఁ గొందఱు తిట్టువారు
పూరుషులఁజంపు నా మహామారులనుచుఁ
దమ మనోదుర్బలత్వంబుఁ దలఁచుకొనక ;
పూరుషుల బాగుపఱుపంగ వారు పూన
నమృత మేటికి స్వర్గసుఖములు నేల?
కాక విపరీతవ ర్తనఁ గడఁగిరేని
శాకినులు డాకినులు వారిసాటి రారు
కలిగినది చెప్పినాఁడఁ దెంకాయచిప్ప. 199.
గీ. భక్తి ప్రబలుత ధారిణీ ప్రజలయందు
దానధర్మ సుర క్తియుఁ దనరుఁగాక
స్వార్థపరత నశించుత జనులయందు
క్ష్మాసు తేశుని కరుణఁ దెంకాయచిప్ప. 200.

గీ. రామకై ఒకర్యమునకును గ్రామములను
సంచరించుచుఁ గన్నట్టి జనులనడత
లందు గొన్నిటి నీరీతిఁ బొందుపఱిచి
వాసుదాసుండు లోకులు బాగుపడఁగ
రామవిభునకు నర్పించె రాగమునను
బ్రథమభాగంబుగాఁగ సద్భ క్తిమీఱ. 201.

**టెంకాయచిప్పశతకము ప్రథమభాగము**

శ్రీరామాయనమః

# టెంకాయచిప్ప శతకము.

## పీ ఠి క

1922వ సంవత్సరము మొదలు నే నీ యొంటిమిట్ట గ్రామమున శ్రీకోదండరామ స్వాములవారి కైంకర్య మునకై గ్రామ సంచారము చేయుట యనేకు లెఱుంగుదురు. ఈ మధ్యకాలములో వ్యాధిబాధచే నాలుమాసములు. సహాయాలస్యముచే నాలుమాసములు, వ్యర్థమైపోయెను. ఎట్లైననేమి 1925వ సంవత్సరమున జరగిన బ్రహ్మో త్సవమునాఁటికి నూతనరథము, హనుమదాలయము, శ్రీరామ సేవాకుటీరము, రామతీర్థమునఁ గొంతకార్యము పూర్ణమై సీతారాముల కటాక్ష వీక్షణము చేతను సజ్జన సాహాయ్యము చేతను నెఱవేఱఁగా గన్నులారఁ గనఁగలిగెను. అయినంతపని యింకను జరుగవలసియున్నది. అది జరిపించుకొనినవాఁడే యిదియును జరపించుకొనునుగాక.

రక్తాక్షిసంవత్సర ఫాల్గునమాసమునఁ; గదిదియందు జరగిన శ్రీనృసింహ బ్రహ్మోత్సవమునకుఁ గదిరియందే నేనుండుట గలిగెను. ఆకాలమున బ్రహ్మశ్రీ జి. సుబ్బాశాస్త్రిగారి యుప్పరిగయందు వారతిథుల కభ్యాగతులకై ప్రత్యేకముగ నిర్మించి యుంచిన గదియందు వారము దినము లుత్సవకారణమునఁ గోదండరామ భిక్షాకార్యము జరగకుండుటచేఁ గాలము రి త్త పుచ్చవలసివచ్చునట్లు తటస్థించెను. అట్టికాలమున నీ శతకము వ్రాయఁబడెను. ఇట్టిది వ్రాయవలయునను సంకల్పమంతకుఁ బూర్వము కలిగినదికాదు. ఆకస్మికము ఆహ్వాన పత్రికయందు దీని పేరు వ్రాసినతరువాత రచన ప్రారంభింపఁ బడెను. సభనాఁటికి గ్రంథము సిద్ధము కావలయునని యేనాఁడు వ్రాసిన పద్యముల నానాఁడే ముద్రణమునకై చెన్నపురికిఁ బంపఁ బడుచుండెను. ఆ కారణముచేతనే చాలు మూల లేక ముందుండ వలసినవి వెనుక వెనుక నుండవలసినవి ముందు నుండుటయే గాక కొన్ని ప్రమాద ఫలితములను గలిగెను. సంచారకాలమున ననుభవముచే మనస్సున నాటియుండినవి. జ్ఞ ప్తియందుండినవి. యా సమయమునకు స్ఫురించినవి యట్లట్లే వ్రాయఁ బడెను. పూర్వసంకల్పములేని కారణముచేతనే చెప్పవలసిన వారి పేర్లు తెలియక స్ఫురణమునకు రాక కొన్ని వదలవలసి వచ్చెను. ఇట్టివా రందఱు దీనియందలి 89వ పద్యమును జూచి నన్ను క్షమింతురుగాక.

అప్పుడు వ్రాసినవానిలో ముద్రణమునకు నవకాశము లేక నిలిచిపోయినవియు బ్రహ్మోత్సవకాలమున వ్రాసినవియు నీ శిష్టగ్రంథమునఁ గాననగును. వీనితో నీ శతకమునఁ బ్రథమభాగము ముగిసెను.

ఇందు నాకుధనమిచ్చినవారు మెచ్చుకొనఁబడిరని యీయని వారు నిందింపఁబడిరని దీనిఁ జదివిన యొకరు తనతోఁ జెప్పినట్టు నా మిత్రు లొకరు చెప్పిరి. ఈ యభిప్రాయము కేవలము పొరపాటు. కేవల ధనము కారణముగ నేనెవరిని నిందింపనులేదు. వందింపనులేదు. 89వ పద్యముఁ జూడుఁడు. నాకుఁగా ధనమిండని నే నెవరిని గోరనుతేదు. తక్కు వయిచ్చినచోటనతృప్తిగాని యెక్కు వయిచ్చినచోట విశేషసంతోషముగాని నేను బడినదిలేదు. ఎవరేమి యిచ్చినను స్వామికే యనియు వారివారి యీవి శ్రద్ధాభ క్తుల కొలఁది వారువారు ఫలము నుభవింతురనియే నా నిశ్చయము. అట్లుండ సంతోషశోకములు నాకేల? ము క్తికన్యాస్వయంవ రాసక్తులైనవారు 'నాకు' ధనమిండని యడుగునంతటి తెలివిమాలినవాఁడను నేనుఁగాను. నీ కిచ్చిన ము క్తి వచ్చునా? యని యెవరైననడిగిన నేనేమి చెప్పుదును? నా దృఢనిశ్చయ మిట్టి దగుటచేతనే " నాకుఁగా మీరు వేయిరూపాయ లిచ్చి నను నేనుఁ దాఁకను. స్వామికిఁగాఁ గాలణా యిచ్చినను శిరసావహించి స్వామికార్యమునకు వినియోగించెద " నని గ్రామగ్రామమందును జెప్పుచున్నాను. నా సహాయు లంద ఱిది యెఱుఁగుదురు. నా కిచ్చితిమని చెప్పిన వారి పైకము మరల నిచ్చిన సందర్భములును గలవు. " స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ " ఈ ధర్మము స్వల్పమైనను సంసార సాగరమునుండి తరింపఁ జేయఁగలదు. అని శ్రీకృష్ణభగవానులు చెప్పియుండుటచే నీ విధముగ లోకులు చేయు సా త్త్వికదానము దాతలకు ముక్తి కన్యాసౌధమునకొక సోపానమగునని శాస్త్రసమ్మత మైన నా యభిప్రాయము. ఇట్టి లాభము ప్రజలకు గలుగవలయుననియే నా కోరిక. 114-132వ పద్యములను జూడుఁడు. భిక్షాపత్రమున "లోకులు బాగుపడఁగ " " ఫలము భుజియింత్రు దాతలు భ క్తవరులు " నను వాక్యములు నేఁడు వ్రాసినవి కావుకదా. విశేషధనమిచ్చినవారిని గుఱించియా 89వ పద్యము వ్రాయఁబడినది? 48వ పద్యమునందలి యెళనీరుకాయ, 49వ పద్యంబులోని పాలు, 0-2-0 కంటె నెక్కు వ వెల చేయునా? ఈ మాత్రము వీని నే నెన్నఁడుఁ గన్నులఁ గాననా? అవియిచ్చిన వారినేల వ్రాసితిని ? యాదాళ్ళ నాగమ్మగారు నా కేమియిచ్చిరి ? ఆమె నేల వ్రాసితిని ? కొంచె మిచ్చినవారని నే నెవ్వరి నలక్ష్య దృష్టిని జూడలేదు. 57వ పద్యముఁ జూడుఁడు. ఇందు నాలవ పాదంబున 'సామాన్యుల ' ననఁగా సా + మాన్యులఁ" అని పదవిభాగము. సా

యనcగా లక్ష్మీదేవి. ఇది తిట్టో దీవనయో విజ్ఞు లెఱుcగుదురు.

నూర్లకొలcది నొసంగ శ క్తివిభవములు గలిగియు 0-0-3, 0-0-4, యిచ్చుటయేగాక మీcదు మిక్కి లి ' పత్రం పుష్పం ఫలంతోయ ' మ్మని పఠించు మతిహీను లెందఱో కలరు. వీరి విషయమై వ్రాసితినా ? కొంచె మిచ్చిరను కారణమున నెందైనc బరిగ్రహింపక మానితినా? కొందఱు లోభులు పత్రం పుష్పం ఫలంతో యమ్మని శాంతిపాఠము పఠించినపుడు దరహాస విస్మయములకుc బాలుపడుచుంటిని. తపస్సు లేనివానికి భ క్తుcడు గాని వానికి, శుశ్రూష లేనివానికి నీ శాస్త్రము చెప్పవలదన్న కృష్ణవాక్యము దలcచి యది యెంత యావశ్యకమని విస్మ య పడితిని. నీవు పొట్టనిండ ముప్పూcట గట్టింపుము. నాకు మాత్రము నీళ్లో యాకులోపండ్లో పూలోయిమ్మని యాకృష్ణుcడు చెప్పెను. " యదన్నం పురుషో భవతి తదన్నంతస్య దైవత " యని యెవని కేది యాహారమో యది వాని దేవతకాహారము. నీవు పండ్లో కాయలో తినిన నా కవియే యిమ్ము చాలును. వానిని భ క్తితో నిమ్మని యర్థము కాని తాను బందిపలెc దిని దేవునికి నీళ్లిమ్మని యర్థముకాదు. వీరు కొంచెమిచ్చిరని యెవరు కొదవపడిరి? ఈ సమాధానవాక్యము లేల?

ఇంతయేల? విశేషకారణములేక నేనెవరిని భూషింపను లేదు. ఆ విశేషకారణము కేవల మపరిచితుcడను భిక్షకుcడనైన నాయట్టియల్పునందు వారువారు కనబఱిచిన భక్తివిశ్వాసములే. నిర్వ్యాజ కరుణయే. అని యెట్టి వైనవి నాకుదెలియును. కొన్ని కొన్ని నాతోడc దిరిగినవారికిc దెలియును. ఇcక దూషణములుగc గానవచ్చు పద్యములందు దూషింపcదగిన గుణములు దూషింపcబడినవి. అట్టి గుణములుకలవారు తమ్ము దూషించితినని తలcచిరేని వారిని నేనాక్షేపింపను. వారికై వ్యసనము పడను. " If the cap fits wear it " అను సామెత కలదుగదా. అట్టివారు గుమ్మడికాయల దొంగవలె తమ గుట్టులు బయలు పడెనని యాక్రోశింపక వానిని దొలcగc ద్రోచికొని యుభయలోకంబులు సుఖింతురుగాక. ఇట్టి దుశ్చేష్టలు కలవారు తాcకు దప్పులు తెలిసి చక్క cబడవలయు ననియు నితరులు వారివలెc బ్రవర్తింప కుండవలయు ననియు నా యాశయముచేc దెలిసికొంటిని.

1. అప్రయత్నలబ్ధ కౌపీనధారణము చేయవచ్చును.
2. దేవగురుదర్శనాది సమయంబుల మఱియొకవస్త్రము అగ్రాహ్యముగాదు ; గ్రహింపవచ్చును.
3. త్రిదినాధిక గ్రాససంచితము నిషిద్ధమే. కాని స్వామి కైంకర్యార్థము నిషిద్ధము గాదు.
4. త్రికాలసంధ్యావందనము సర్వదా అనుష్ఠేయము స్నానమువిడువరాదు. తక్కి నకర్మములు అవశ్యకము లేదు.
5. ఆత్మార్థము యాచితము ప్రతిగ్రహము సర్వము నిషిద్ధమే. ఇచ్చువారు సంతోషముతో అయాచితముగ " అచ్యుతః ప్రీయతా " మ్మని యిచ్చినపుడు మనము " అచ్యుతః ప్రీయతా " మ్మని గ్రహింపవచ్చును.
6. శరీరపోషణార్థము కాదు. శరీరధారణార్థము ప్రీతిచే నియ్యబడినదానిని " అచ్యుతః ప్రీయతా " మ్మని గ్రహింపవచ్చును.

స్వప్నవిషయము గమనించిన భగవంతుcడే తమయం దనుగ్రహబుద్ధితో నుపదేశించినటులు నిశ్చయము. ఆ ప్రకారమే యుంటున్నారు. ఏకాంతవాసము చేయునటు లుండినయెడల బైరాగి చెప్పినరీతిగనే చేయవచ్చును. లోకాతీతముగ నుండు విషయమందు నీ కాలమునకు అటులుండుట యుచితముగ తోcచలేదు. ఇదియునుగాక మీ సంకేతప్రకారము కౌపీనము లబ్ధమైనందున భగవత్సంకల్పముగూడ తాము దానిని ధరింపవలయుననియే యున్నట్లు యేర్పడుచున్నది.

నడాదూరు - నరసింహాచార్యః.

మా యాచార్యులవారి యిట్టి యాజ్ఞ ననుసరించి చింపి గోcచినైనను యాచించు నధికారము లేని వీcడు ధనము తనకీయలేదని పరుల దూషించెనని తేరకుc గోపించువారి కేమి ప్రత్యుత్తర మీయగలcడు.

ఒకానొకcడు 8వ పద్యంబునందలి " బడుగులు " 22వ పద్యంబునందలి " కఠినమతులు " నెవ్వరో పేర్లు వ్రాయవలసినదిగాcగోరెను. చెప్పcగూడియుండిన నేనేల వారినిc బేర్కొ ని యుండనని యాయనకుc దోc చినదికాదు. ఆనాcడు దేవాలయ సభలో నేను జెప్పినట్టు లీ టెంకాయచిప్పశతకమునకు మాఱు పేరు ముక్తికన్యా స్వయంవరము. " ముక్తికన్యాస్వయంవ రాసక్తులై " యథాశ క్తిభ క్తియు క్తినెవ్వరు స్వామికార్యమునకు సాహాయ్య మాచరించిరో వారిపేర్లుమాత్రమిందుc దెలుపcబడినవి.

కొందఱ పేర్లు రెండుమూcడుమార్లు స్మరించితినcట. సత్యము. రెండుమూcడువిధముల నాదరించిన వారిని రెండు మూcడు చోటులc బేర్కొ నియుందును. నాకుcగా 5-6 మైళ్ళనుండి యెండనక చీcకటియనక పూcటపూcటకు బాలుమోచి తెచ్చియిచ్చువారిని, దేహమున ధరించిన బంగారు సొమ్ములు నట్లట్లే చిప్పలో వైచిన

వారిని, గ్రామము వెలుపలఁ జెట్టుక్రిందనో బావిపంచనో సత్రమునందో దేవాలయమందో దిగి యుండు నన్ను సకలవిధముల నాదరించినవారిని, నెన్ని మార్లు స్మరించిన నేమి దోషము ?

తపస్సు చేసికొనువారి దేహము నెవరు పోషింతురో యట్టివా రా తపస్వితపస్సులో సగము భాగమును బొందుదురని శాస్త్రము చెప్పుచున్నది. పరదేశముల నొంటిమైఁ దిరుగు నన్నీవిధమున నాదరించి పోషించిన పుణ్యాత్ములను సాధ్వులను స్మరింపక స్వామికైంకర్యమునకు సాహాయ్యము చేయవలదని చెప్పువారిని, సమారాధనము నకుఁగా వంట చేయింప నచ్చోటికిఁ దురుష్కులను గ్రైస్తవులను గార్యముఁ జెఱుపఁబంపువారిని స్వామిద్రవ్యమును దుర్వినియోగపఱుచువారిని, స్వామిద్రవ్యము తీసికొని మరల నిచ్చుటకు దుఃఖించువారిని, స్వామి పదార్థములఁ దీసికొని యియ్యనొల్లనివారిని స్మరింపవలయునా? ఇట్టివారి పేర్లకుఁ దగిన తావు " అపకీ ర్తివిధవాస్వయంవర నాటకము. "

ధనము నీయనివారిని దూషించితినని మతిమాలినవాఁ డెవ్వఁడైన ననెనేని నాహితముఁ గోరినవారు వాని నిట్లడుగఁ బ్రార్థించెదను. తొలుతనే ధనమీయ ననినవారిని దూషించెనా ? ఇచ్చెదనని బాసచేసి వ్రాసి 5 సంవత్సరము లయినను యియ్యనివారిని దూషించెనా ? అట్లు దూషించిన పద్యము లెవ్వియని యడిగి వాఁ డేపద్యమైనఁ జూసె నేని నిజముగా నది ధనమీయఁబడమికై వ్రాయఁబడినదా యని పరిశీలింపఁ గోరెదను భిక్షాపత్రములో మ-రా-శ్రీ జయరామనాయనివారి పేరు విశ్వాసులనుండి యేల తొలఁగించితివని కొందఱు మిత్రులును, వారు నీపై నేనేమో చెప్పినారే యేల మీకు మైత్రి చెడినదని కొందఱు స్నేహితులను బ్రశ్నించిరి. ప్రశ్నించుచున్నారు. ఇట్టివారు పెక్కు రుండుటచే నిందలకు వేలువేలుగా నీ పాడుపాట పాడ నిష్టము లేదు. అందఱకుఁ దెలియునట్లు విశ్వాసిత్వము వదలుకొనుచు వ్రాసిన వారి యు త్తరమునకుఁ బ్రత్యుత్తరముగా నేను వ్రాసియుండిన యుత్తరము నిందుఁ బొందుపఱిచితిని. దానివలనఁ గొంత యెఱుఁగనగు. తక్క న విషయములు కాలాంతరమునఁ గ్రమముగ లోక మెఱుంగఁ గలదు. చాటుచాటున మూలమూలలఁ జెవులుకొఱకు నీచుఁడను నేనుగాను. నిజము నిలుకడమీఁదఁ దెలియును.

" మహారాజశ్రీ, శి. జయరామనాయఁడుగారికి.

మిత్రులారా !

అక్టోబర్ నెల 23 తేది యందు మీ రొంటిమిట్టలో వ్రాసి 2-11-24 తేదియందు తిరుపతిలో రిజిష్టరుచేసి (Acknowledgment due) గా పంపిన యుత్తరమీనాఁడే చేరినది. మీచిత్త వృత్తియందుఁ గలిగినవికారమునకు స్నేహబలమునఁజేసి చాల విషాదపడితిని. ఇట్టివికృతికిఁ గారణమేమైనది నేనూహింపఁజాలకున్నాను. మీకు నే నేదియుఁ గీడు కావించినవాఁడనుగాను. 3-4 సందర్భములఁ దప్ప మీ యభిప్రాయమునకు విరోధముగఁ బోయినవాఁడను గాను. నాయందు దోషము లుండినయెడల వానిని నాకుఁ దెలిపి సవరించుకొమ్మని హిత ముప దేశింపరాదా ? లేదా యీ నీ కార్యములు సరిగా నాకుఁ దోఁపలేదు. ఏమి సమాధానము చెప్పెదవనిన నేను జెప్పి యుండనా? ఇరుగు పొరుగున నుండువారికి రిజిష్టరు జాలులేల? (Acknowledgment due) లేల? అయినను మీరు వ్రాఁతలకు దిగితిరి కావున నేను నట్టులే చేసెదను. స్వామికి సాహాయ్యము చేయఁదలఁచిన బ్ర॥ శ్రీ॥ పెంచలు సుబ్బయ్యగారికి 0-0-6 లు దండుగని ప్రకటన పత్రికను బంపని వారికి 0-4-0 లు వ్యయపెట్టునపు డెంత పరితాపము కలిగెనోకదా యని మిగులఁ బరితపించితిని. 23-10-24 తేదియందునే నొంటిమిట్టచేరితిని. 24వ తేది యుదయమున మనమిరువురము కలసి మాటలాడితిమి. అప్పుడు ప్రస్థావించి యుండినయెడల నప్పుడే సమాధానము చెప్పియుందును గదా. అటైన నీ ప్రసంగమిరు చెవిసోఁకక యుండునుగదా. అప్పుడను కూలపడ లేదందు రేని 2వ తేది నే నీయూరనే యుంటిని. మీరును 2వ తేది సాయంకాల మీయూరు చేరితిరి. ఇచ్చుటవ్రాసిన దానిని దిరుపతిలో రిజిష్టరుచేసి వెంటనే రాకుండినఁ గూడఁ దెచ్చియిచ్చి యుండరాదా? అడిగియైన నుండరాదా? ఈ ఋజుమార్గమును వదలి వక్రమార్గమున నడచుటచేతనే మీ మనస్సు వికారమునొంది క్రోధమునకుఁ బాలుపడినదని గ్రహింపవలసివచ్చెను.

తొలుత మీ మనస్సునందు నాపై స్నేహభావమును నిప్పుడీ దుర్వికారమును గలిగించినవాఁడు శ్రీరామ చంద్రుఁడే కావున మొదటిదాని కెట్లు పొంగలేదో రెండవదానికట్లు క్రుంగెడివాఁడనుగాను. అన్యథాశరణం నాస్తి త్వమేవశరణం మమయని శ్రీసీతారాముల నేనమ్మి యీకైంకర్యమును నిర్వహింపఁ బూనితిని. ఆసహాయముననే నిర్వహించుచున్నారు. ఆ సహాయ బలముననే నిర్వహింపఁగలను. సత్యము, " కర్మమందే యధికారంబు నీకుఁ గర్మఫలంబులఁగాదీవు కోర " నను వాక్యములే నాకుఁ బ్రమాణములు. యథాశక్తి నిర్వంచనముగ కార్యము చేయుట నావంతు. కార్యము సొంతమగుట కాకుండుట రాముని వంతు నానిశ్చయ మిట్టిదైయుండ నేనొకరి కోప

